Photo by N. Ramakrishna



బహుమతి
పొందిన వ్యాఖ్య

మూగనోము పట్టాము

పంపినవారు :
డి. ఎస్. నాయుడు-రేణిగుంట

ఫౌన్‌టెన్ కలములకు,
సిరాలకు
జగత్ప్రసిద్ధి పొందిన
పేరు

# పైలట్

మరల ఇప్పుడు
భారతదేశములో
ప్రతి చోట
లభించుచున్నవి

*

నాణ్యమునకు
పూచీ

PILOT INK

MANUFACTURED BY

**THE PILOT PEN CO. (INDIA) LTD.**

CATHOLIC CENTRE, MADRAS-1.

# డోంగ్రేగారి

## బాలామృతం

బలహీనమైన బిడ్డలకు పుష్టినిచ్చి, పండ్లు మొలిచేటప్పుడు అయ్యే విరేచనములు నిలిపి, బలమును ఆరోగ్యము నిచ్చును.

**K. T. Dongre & Co., Ltd., BOMBAY-4**




## ఆంధ్రుల చరిత్ర సంస్కృతి

ప్రతి ఆంధ్రుడు చదువ దగిన సద్గ్రంథము. ఆంధ్ర రాష్ట్ర సాధనకు మిక్కిలి తోడ్పడిన గ్రంథము.

పే. 500. వెల రు 6 0 0




బాలసరస్వతి
పిక్టోరియల్ మీడియం డిక్షనరి
(ఇంగ్లీషు ఇంగ్లీషు—తెలుగు)

విద్యకు, విజ్ఞానానికి, పరీక్షలో విజయానికి ఈ డిక్షనరీ వుపయోగపడుతుంది. 1000 పేజీలు. పూర్తిక్యాలికో బైండు

మీడియం ధర 9 0 0
జెం డిక్షనరీ ధర 4 8 0




## గానకళాబోధిని

అపూర్వ సంగీత గ్రంథము. గొప్ప అనుభవజ్ఞులచే రచింపబడినది. సంగీతము నేర్చుకొనుటకు, సాధనకు, పరీక్షలకు పిన్నలకు పెద్దల కుపయుక్తపడు గ్రంథ రాజము.

పే. 1000. రు. 10 0 0

తమ ఆర్డరుతోపాటు అడ్వాన్సు పంపగలరు.

ప్రకటించువారు: **బాలసరస్వతీ బుక్ డిపో, కర్నూలు.**

బ్రాంచి:—నెం. 6. సుంకు రామచెట్టి వీధి, మద్రాసు.




మైసూర్ & తమిళ్‌నాడ్ : రాజ్‌శ్రీ రిలీస్.
ఆంధ్ర, సీడెడ్, నైజాం : చమ్రియా రిలీస్.
బొంబాయి : శ్రీనివాస రిలీస్.

## FEBRUARY RELEASE

రోహిణీవారి

# బీదలఆస్తి

దర్శకత్వం. డి. ఎల్. రామచందర్

తారాగణం

జానకి..........సూర్యకాంతం
హేమలతాదేవి... చంద్రకుమారి
కుమారితులసి........ బేబీగిరిజ
జగ్గయ్య ...............రాజనాల
దొరస్వామి..............గుమ్మడి
రమణారెడ్డి
మాస్టర్‌సుధాకర్
మాస్టర్‌కుందు





పూర్ణా రిలీజ్

Elegant




infa

అరవై సంవత్సరములపైనుంచి డాక్టర్లు పెర్టుసిన్ టెష్నర్‌ను సిఫార్సు చేయుచున్నారు. ఎందువలననగా అది దగ్గులకు, గొంతు నొప్పికి శ్వాసకోశ వ్యాధికి, ఉబ్బసమునకు, కోరింత దగ్గుకు ఉపశమనము నిచ్చును. క్షేమముగా స్వస్థతనిచ్చును. తీసుకొనుటకు యింపితమైనది. పెర్టుసిన్ కొనుడు!

అందరు కెమిస్టుల వద్దను లభించును

ఎటెఫా లి., షాన్ లీచ్‌టెన్‌స్టైయన్, స్విస్ కస్టమ్ అండ్ ఎకనామిక్ టెర్రిటరీ వారితో చేసుకున్న ఒడంబడిక ప్రకారము, యిండియాలో ఇన్‌ఫా లి., పోస్టు ఆఫీసు బాక్సు నెం. 1041, బొంబాయి-1 వారిచే తయారయినది.

ILY-9-TEL



## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవిగాక - రంగుల బొమ్మ కథ,
ఫోటోశీర్షికల పోటీ - మొదలైన మరిఎన్నో ఆకర్షణలు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఇప్పటికి మూడేళ్లక్రిందట ఒకసారి పి. సి. సర్కారు మదరాసుకు వచ్చిన సంగతి తెలుసుకదా! ఆయన ఖండాంతర ప్రజలనే ఆశ్చర్యపరిచి, ప్రపంచఖ్యాతి గడించిన ఐంద్రజాలికులలో అగ్రగణ్యుడని పేరు పొందినవాడు. ప్రొఫెసర్ సర్కారు మనకు కొత్తవాడు కాదు. చాలాకాలంనుండి తన ట్రిక్కులను చందమామకు అందిస్తూనేవున్నాడు. 'నేనూ చందమామ కుటుంబంలోనివాడినే' అని తరుచు ప్రస్తుతించే మన సర్కారు మళ్లీ ఈ సంవత్సరారంభంలో మద్రాసు వచ్చారు. ఈసారి, అద్భుతమైన కొత్త ట్రిక్కు లెన్నో ప్రదర్శించి, ఆనందం కల్గించారు. ఆయన తన అభిమానాస్పదమైన 'చందమామ' కార్యాలయానికి వచ్చి, పాఠకులకూ, రచయితలకూ అభివందనాలు తెల్పారు.



ఫిబ్రవరి
1955

సంపుటి 16
సంచిక 2

# పందెం!

కట్టమంచియను గ్రామమందున
గట్టివాడు బంగారయ్య!
రచ్చబండపై వచ్చికూర్చుని
ముచ్చటగా యిట్లన్నాడు!
"వినండి వినండి వినండి పెద్దలు
విచిత్రమొక్కటి చెబుతాను!
చిన్నకోడికి చేతులు చూపెద
నన్నా చూడండ"న్నాడు!
ఏమిటేమిటి? ఎక్కడెక్కడ?
ఏదీచూపుము అనిరంతా!






"పందెంవేసి వందరూకలు
ముందుబెట్టితే చూపెదను!
ఓడిపోతినా ఒక్కవందను
నిక్కముగా మీకిచ్చెదను"
అనగానేవిని అచ్చటి పెద్దలు
అప్పుడె డబ్బులు తెచ్చారు!
బంగారయ్య కంగారెత్తక
పదుగురతో నిటు పలికాడు!
అందరు బాగా ఆలోచించి
ముందుకువచ్చిన మంచిదని!
చిన్న కోడికి చేతులుజూపుము
అన్నా వందా నీదనగా!






*  *  *

అనగానే విని ఆగ్రహములతో
అందరు పైకెగ బ్రాకారు!
మఱచినారు నామాటలేమిటో
మఱలా ఒకపరి చెప్పండి!
"కోడికి చేతులు చూడుడు చూపిత
ఓడిపోతిర"ని చెప్పాడు.
పందెముబెట్టిన వందరూకలు
బంగారయ్యకు యివ్వగనే–,
మీసలుదిప్పి మెలివేశాడు
మేటిఘనుడు బంగారయ్య!

బంగారయ్య భళిభళియంటూ
చెంగున పల్టీ కొట్టాడు!
రండి వెనుకనే రండిరండియని
రయమున పెద్దల పిల్చుకొని–,
ఇంటిముంగిట పోగునుచిమ్మెడు
జంటకోళ్ళను చూపించి–,
"కాంచండన్నా కన్నులుయున్న
కరములు చూపితి కోడికివే!"
అని తన చేతులు అందరియెదుట
ఆ వైపునకు చాచాడు!
"చూడుడు చేతులు కోడికి చూపితి
కోరిన పందెం యింతేగా!"



# అట్టమీది బొమ్మ

భీమసేనుడు, ద్రౌపది కోరిన సౌగంధిక పుష్పంకోసం ఈశాన్యదిశకు బయలు దేరాడుకదా!—త్రోవలో అడ్డుపచ్చిన వృక్షాలనన్నిటినీ తన బాహుబలంవల్ల ఛేదించుకొంటూ, ముందుకు సాగిపోయాడు. ఈవిధంగా, అరణ్యం దాటుకొని గంధమాదన పర్వతానికి సమీపంలోవున్న ఒక కదళీవనం ప్రవేశించాడు.

ఆ వనంలోనించి పోతూవుండగా, దారిలో కూర్చునివున్న ఒక వృద్ధ వానరం కనిపించింది. 'ఏయ్, ముసలికోతీ!—దోవవిడు!!' అని భీముడు గర్జించాడు. అందుకా వానరం వృద్ధాప్యంవల్ల వణికిపోతూ 'అయ్యా, నేను లేవలేని స్థితిలో వున్నాను. కనుక, నా తోక కాస్త పక్కకి తోసి, నీవు నీదారిన వెళ్ళు' అని అన్నది.

భీమసేనుడు చాలా అలక్ష్యంగా దాని తోకను తన ఎడమకాలితో తోయ బోయాడు. కదలలేదు. బలంకొద్దీ చేతితో లాగాడు. అప్పటికీ కదలలేదు. అప్పుడు రెండు చేతులతోనూ బలంకొద్దీ వూపిచూచాడు. కాని తోక రవంత కూడా కదలలేదు. అది సామాన్య వానరం కాదని భీముడు గ్రహించాడు.

వెంటనే, భక్తిగౌరవాలతో ఆ వృద్ధవానరానికి చేతులు జోడించి నమస్కరిస్తూ, 'మీరెవరో మహాత్ముల్లాగా వున్నారు. నన్ను మన్నించి, మీ వృత్తాంతం చెప్పి అనుగ్రహించండి!' అంటూ ప్రాధేయపడ్డాడు.

అప్పుడా వానరం చిరునవ్వుతో 'తమ్ముడా! నేను వాయుపుత్రుడనైన హనుమంతుణ్ణి. నీకు, అన్నను. ఇదిగో చూడు, నా విశ్వరూపం...' అని చెప్పి, భూమ్యాకాశాలను ఒక్కటిగా చేసేటట్టు తన నిజరూపంతాల్చి నిలబడ్డాడు. భీమసేనుడు సంతోషించి, హనుమను స్తుతించగా, హనుమంతుడు మెచ్చుకొని పాండవుల భవిష్యాన్ని చెప్పి, "సోదరా!—ముందు మీకూ కౌరవులకూ జరగ బోయే యుద్ధంలో నేను అర్జునుడి ధ్వజంపైనే ఉండి, మీకందరకూ బలం చేకూరుస్తాను' అని వరమిచ్చాడు. భీమసేనుడు సంతృప్తుడై, హనుమ చెప్పిన దోవనే వెళ్ళి సౌగంధికవనం ప్రవేశించాడు. కుబేరుని కాపలావాళ్ళయిన యక్షులు భీమసేనుణ్ణి అటకాయించారు. భీముడు వాళ్ళతో యుద్ధంచేసి, వాళ్ళని పడగొట్టి, తనకు కావలసినన్ని సౌగంధికపుష్పాలు తీసుకొని మరలి పోయాడు. ద్రౌపదికి పరమ సంతోషమైంది.




బుందేల్‌ఖండ్‌లో ఒక ఠాకుర్ వంశస్థుడుండేవాడు. ఆయనను అందరూ దీవాన్ సాహెబ్ అని పిలిచేవారు. ఆయనకు తిండికికూడా సరిగా గడవకపోయినా రాజసం చాలా ఉండేది. ఉద్యోగం చేసేవాడు కాడు. తన వంశంయొక్క గొప్పతనంగురించి డాబులుకొడుతూ అందరి కాలమూ పాడుచేసేవాడు.

ఒకనాడు దీవాన్‌సాహెబ్ వీథిలో నిలబడి ఒక షావుకారుతో మాట్లాడుతూండగా దూరాన ఒక బండీ కనిపించింది. దాని మీద ధాన్యంబస్తాలు ఎత్తుగా వేసిఉన్నాయి. ఆ బండి వారివైపే వస్తోంది. ఆ బండిని చూస్తూనే దీవాన్‌సాహెబ్, "ఆహా! ఎంత పెద్ద ఏనుగు! మా తాతగారిదగ్గిర ఇలాటి ఏనుగే ఉండేది!" అన్నాడు.

"తమరు పరాకు చిత్తగిస్తున్నారు, దీవాన్‌సాహెబ్. ఆ వచ్చేది ఏనుగు కాదు, ధాన్యపుబస్తాలు వేసిన బండీమాత్రమే," అన్నాడు షావుకారు.

"మీకు చత్వారం వచ్చేసినట్టుంది, షావుకారుగారూ! ఏనుగు స్పష్టంగా కనిపిస్తుంటేనే?" అన్నాడు దీవాన్‌సాహెబ్.

"క్షమించాలి! అది ధాన్యపు బస్తాల బండీ!" అన్నాడు షావుకారు.

దీవాన్‌సాహెబ్‌కుకూడా పంతంవచ్చింది.

"అది ఏనుగైతే నేను మీ తల నరికేస్తాను. బండీ అయితే నా తల మీరు నరకండి! ఇదే మనిద్దరిమధ్యా పందెం!" అని మీసాలు మెలివేస్తూ ఠీవిగా నిలబడ్డాడు దీవాన్‌సాహెబ్.

కొద్దిసేపట్లోనే బండీ సమీపానికి వచ్చింది.

"చూశారా, దీవాన్‌సాహెబ్? మీరు ఓడిపోయారు!" అన్నాడు షావుకారు.

"అవును. మీరు నా తల నరికెయ్యండి," అన్నాడు దీవాన్‌సాహెబ్.

వి. ఆదినారాయణ



"దేనికిలే పోనివ్వండి!" అన్నాడు షావుకారు, ఇకనైనా ఈ ఠాకుర్ వంశస్థుడు ప్రగల్భాలు మానేస్తాడన్న ఆశతో.

"అలా వీల్లేదు! మీరు పందెంప్రకారం నా తల నరకవలిసిందే! మా ఠాకుర్ వంశస్థులు అడితప్పరు!" అని దీవాన్ సాహెబ్ మొండితనం చేశాడు. షావుకారుకు ప్రాణంమీదికొచ్చింది.

"ఈ విషయం న్యాయాధికారిని సంప్రతించటం మంచిదనుకుంటాను," అన్నాడు షావుకారు.

ఇద్దరూ కలిసి న్యాయాధికారిదగ్గిరికి వెళ్లారు. న్యాయాధికారి విషయమంతా విని, షావుకారుకు సంప్రాప్తించిన దుస్థితి కనిపెట్టి, ఈవిధంగా తీర్పు చెప్పాడు:

"దీవాన్‌సాహెబ్‌గారి తల షావుకారు సొత్తయిన మాట నిజమే. కాని దాన్ని ఆయన తన యిష్టంవచ్చినప్పుడు నరుక్కోవచ్చు. ఆయనను తొందరచేయటానికి ఎవరికీ అధికారం లేదు."

ఈ తీర్పుకు షావుకారు సంతోషించాడు. కాని దీవాన్‌సాహెబ్ పేచీపెట్టాడు:

"అయితే ఈ క్షణంనుంచీ నా తలను రక్షించే భారమూ, పోషించే భారమూ షావుకారుదే. దాన్నిగురించి నా పూచీ ఎంత మాత్రమూ లేదు!" అన్నాడాయన.

షావుకారు గత్యంతరంలేక దీవాన్‌సాహెబ్ తలను రక్షించి పోషించేభారం తన మీద వేసుకున్నాడు. కాని ఈ భారం కొద్ది పాటిదికాదు. దీవాన్‌సాహెబ్ తన వంశ మర్యాదకు తగినవిధంగా షావుకారుచేత చేయించుకుంటూ, షావుకారు ఇల్లు గుల్ల చేయసాగాడు.

కొంతకాలం గడిచింది. షావుకారుకు పట్టిన ఈ పీడను ఏ విధంగా విరగడ చేయాలా అని చాలామంది మిత్రులు ఆలోచించారు. చివరకు ఒక ఉపాయం తోచింది. దాన్ని షావుకారుకు చెప్పేశారు.

మర్నాడు వీథివెంట ఒక వ్యక్తి, "ముక్కులు, చెవులు కొంటాం!" అంటూ వచ్చాడు. షావుకారు ఆ మనిషిని పిలిచి "ఏమిటి నువ్వు కొనేది?" అని అడిగాడు.

"బాబూ, మనుషుల ముక్కులూ, చెవులూ కొంటాం," అన్నాడు కొత్తమనిషి.

"ఎంత ధర యిస్తావ్?" అన్నాడు షావుకారు.

"గొప్పవంశంవాళ్ళవైతే ముక్కూ, రెండు చెవులూ కలిపి అయిదువందలు," అన్నాడు వచ్చిన మనిషి.

షావుకారు ఆ మనిషికి దీవాన్‌సాహెబ్‌ను చూపించి, "ఈయన గొప్ప ఠాకుర్ వంశస్థుడు. ఈయన తల ప్రస్తుతం నాదే. కనక అయిదువందలూ ఇచ్చి ఈయన ముక్కూ, చెవులూ కోసుకుపో!" అన్నాడు.

దీవాన్ సాహెబ్‌కు హడలెత్తింది.

"అయ్యా, షావుకారుగారూ, ఇది న్యాయంకాదు," అన్నాడాయన.

"ఎందుకు న్యాయంకాదు. ఈ తల నా సొత్తు. దీనిని నేను ఎంతో డబ్బు తగలేసి పోషిస్తూవస్తున్నాను," అన్నాడు షావుకారు.

"మనం న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళి ఆయన సలహా తీసుకోవటం భావ్యంగా ఉంటుంది," అన్నాడు దీవాన్‌సాహెబ్.

ఇద్దరూ మరోసారి న్యాయాధికారిదగ్గిరికి వెళ్ళారు. న్యాయం చెప్పమన్నారు.

"షావుకారుకు మీ ముక్కూ, చెవులు అమ్మే అధికారం తప్పకుండా ఉన్నది. లేదని మీరు వాదించేపక్షంలో ఆయన ఇంతకాలమూ మీ తలను మీ తరఫున పోషించాడన్నమాట. అందుచేత మీకింద షావుకారు చేసిన ఖర్చంతా మీరు షావుకారుకు ఇచ్చుకోవలసి ఉంటుంది!" అన్నాడు న్యాయాధికారి.

మారు మాటాడకుండా దీవాన్‌సాహెబ్ తనకున్న కొద్దిపాటి ఆస్తినీ షావుకారుపేర పెట్టి ఆ గ్రామం విడిచి వెళ్ళిపోయాడు.





# నాలుగో దొంగ

ఒక దేశంలో ముగ్గురు గజదొంగలుండే వారు. వారు రోజుకొక దొంగతనం చేసినా వారిని పట్టటం ఎవరికీ సాధ్యం కాలేదు. వాళ్ళ పేరు చెబితే ధనికులకు సింహ స్వప్నంగా ఉండేది. వాళ్లను ఏవిధంగానైనా పట్టాలనే ఉద్దేశంతో ఆ దేశపు రాజు ప్రతి రాత్రి తానుకూడా ఒక దొంగలాగా వేషం వేసుకుని తిరగసాగాడు.

ఈవిధంగా కొన్ని రాత్రులు తిరగగా తిరగగా ఒక చీకటి రాత్రి రాజుకు దొంగ లుండే స్థలం చిక్కింది. రాజు అక్కడికి చేరుకునేసరికి ఆ దొంగలు ఆ రాత్రి తాము చేయదలచిన దొంగతనం గురించి ఆలో చిస్తున్నారు.

కొత్త దొంగను చూడగానే గజదొంగ లకు, కొంత అనుమానంకలిగి: "ఎవరు నీవు? ఇక్కడికి ఏం పనిమీద వచ్చావు?" అని అడిగారు.

"నేనూ దొంగనే. ఈ ప్రాంతాల మీరు చాలా గొప్ప దొంగలని విని మీకు నాశక్తి చూపించ వచ్చాను," అన్నాడు రాజు.

దొంగలు నవ్వి, "మా శక్తులనుగురించి నీకేమైనా తెలుసా?" అని అడిగారు.

"తెలియదు. చెప్పండి, వింటాను!" అన్నాడు రాజు.

"నేను ఎంతలావు తాళాన్నయినా పూచికపుడకతో తీయగలను," అన్నాడు మొదటి దొంగ.

"నేను భూమికి చెవిపెట్టి ఆలకించా నంటే డబ్బు ఎక్కడ ఉన్నదీ పసికట్ట గలను," అన్నాడు రెండో దొంగ.

"ఒకసారి చూసిన మనిషిని నేను ఏ మారువేషంలో ఉన్నా పోల్చగలను," అన్నాడు మూడో దొంగ.

"నీకుగల శక్తి ఏమిటి?" అని ముగ్గురు దొంగలూ రాజును అడిగారు.

ఎస్. కోదండరామయ్య

ఏం చెప్పాలో రాజుకు తోచలేదు. అందు చేత ఆయన ఈవిథంగా అన్నాడు:

"నేను బొటనవేలు కిందికి దించానంటే ఎవరినైనా యమలోకానికి పంపగలను. చూపుడువేలు పైకి ఎత్తానంటే చావటానికి సిద్ధంగా ఉన్నవాళ్లుకూడా బతికి బయట పడతారు."

ఈ మాటవిని ముగ్గురు దొంగలూ సంతోషించారు. తమ అంత శక్తిసామర్థ్యాలు కలవాడూ, తెలివైనవాడూ తోడు వచ్చాడనుకున్నారు.

"ఈరాత్రి ఎక్కడికి దొంగతనానికి పోదాం?" అని అడిగాడు రాజు.

"నీయిష్టం! నువు కోరుకున్న చోటికి పోదాం. మా శక్తిసామర్థ్యాలు నువే చూతువుగాని!" అన్నారు దొంగలు.

"అయితే, రాజుగారి ఖజానా కొల్లగొడదాం!" అన్నాడు రాజు.

నలుగురూ కలిసి రాజప్రాసాదానికి బయలుదేరారు. పహరావాళ్ళ కంటబడకుండా లోపలికి చేరారు. రెండో దొంగ నేలకు చెవిపెట్టి ఆలకించి :

"ఖజానా ఈవైపుగా వుండి. జాగ్రత్తగా నడవండి!" అని చెప్పాడు.

నలుగురూ అటుకేసి వెళ్ళారు. ఖజానాకు పెద్దతాళం వేసివుంది. కాని దాన్ని



మొదటి దొంగ క్షణంలో ఊడదీశాడు. దొంగలు లోపల ప్రవేశించారు.

ఈ సమయంలో రాజు వాళ్ళకు తెలియకుండా వెళ్ళిపోయి తన భటులను పంపాడు. గజదొంగలు ముగ్గురూ సొత్తుతో సహా పట్టుబడ్డారు.

మర్నాడు వారిని విచారణకు దర్బారుకు తెచ్చారు. సింహాసనం మీద కూర్చున్న రాజును చూస్తూనే మూడో దొంగ తన తోటి వాళ్ళతో, "ఈయనే నిన్న మనతో దొంగతనానికి వచ్చిన కొత్త మనిషి!" అని చెప్పాడు.

విచారణఅంతా అయిపోగానే రాజు తన కుడిచేతి బొటనవేలు కిందికి తిప్పాడు. గజదొంగలకు మరణశిక్ష విధించబడింది.

మర్నాడు ఉదయం వారిని ఉరికంబం వద్దకు తీసుకుపోయారు. అధికారి ఒకడు వచ్చి, "మీ ఆఖరు కోరిక ఏమిటి?" అని దొంగలను అడిగాడు.

"రాజుగారిని ఒక్క ప్రశ్న అడగాలి. అదే మా ఆఖరు కోరిక!" అన్నారు దొంగలు.

రాజుగారు వచ్చాడు.

"మీరు నన్నడగగోరే ప్రశ్న ఏమిటి?" అన్నాడాయన.

"మరేంలేదు, మహాప్రభూ! మా శక్తులు మీకు ప్రదర్శించాం. మీశక్తులను గురించి మాకు రెండు విషయాలు చెప్పారు. అందులో ఒకటే ప్రదర్శించారు. రెండవది కూడా చూసి సంతోషించాలని మాకోరిక!" అన్నాడు మూడో దొంగ.

రాజు చిరునవ్వు నవ్వి తన చూపుడు వేలు పైకెత్తాడు. వెంటనే రాజభటులు వచ్చి గజదొంగల కట్లు విప్పేసి, ఉరికంబం నుంచి దించేశారు.

తరువాత ఆ గజదొంగలు దొంగతనాలు మాని రాజుదగ్గిరే కొలువుంటూ, రాజుగారి పట్ల ఎంతో భక్తిగా కాలంగడిపారు.






రెండువేల సంవత్సరాలక్రితం చీనా దేశంలో సో-పో-తావ్రా అనే వృద్ధు డుండే వాడు. ఆయన పేరుపడిన పండితుడు. కాని ఆయన పాండిత్యానికి మెచ్చి ఆదరించే దాతలు లేక దారిద్ర్యం అనుభవించేవాడు.

దూరాన చూ రాజ్యానికి రాజుగా ఉంటున్నవాడుకూడా గొప్ప పండితుడే. ఆయన పండితులను ఆదరించి, దగ్గిర ఉంచుకుని, వస్తువాహనా లిస్తాడని ప్రతీతి. ఆయనవద్దకు వెళ్ళి సన్మానాలు పొందవలి సిందని తావ్రాతో అనేకమంది మిత్రులు చెప్పారు. మిత్రుల మాటలు తోసివెయ్య లేక తావ్రా తనవద్ద గల కొద్దిపాటి ఉన్ని దుస్తులూ, ధనమూ తీసుకుని చూ రాజ్యానికి కాలినడకను ప్రయాణమయాడు.

అనేకవందల మైళ్ళు వెళ్ళాలి. కొండల మీదుగా కష్టపడి ప్రయాణం చేయాలి. దారిమధ్యలో చలికాలం సంప్రాప్తమయింది. ఎక్కడైనా కొద్దిరోజులు విశ్రాంతి తీసుకుందామని, ఒక ఊళ్ళో యాంగ్-చియావ్రా-ఆయీ అనేవాడి ఇంటికి వెళ్లాడు.

ఆయీ తావ్రాకు చక్కగా అతిథి సత్కారం చేశాడు. తావ్రా పండితుడని తెలిసి ఆయీ మరింత ఆనందించాడు. అయితే ఆయీ మాత్రం సామాన్యుడు కాడు. ఆయనవద్ద ఉన్న పాతగ్రంథాలు చూస్తే ఆయీ తనకంటె చాలా రెట్లు పాండిత్యం గలవాడని తావ్రాకు తెలిసి పోయింది. ఆయనతో పాండిత్య చర్చలు జరిపి తావ్రా ఈ విషయం మరింత గట్టిగా రుజువుచేసుకున్నాడు.

"చూ దేశపురాజు పండితులను గొప్పగా సత్కరిస్తాడట. ఆయనను చూడబోతున్నాను. నీవుకూడా నావెంట రారాదా?" అని అడిగాడు తావ్రా. ఆయీ ఒప్పుకుని, చలి దుస్తులూ, డబ్బూ తీసుకుని బయలుదేరాడు.

పి. తులసీరావు

ఇద్దరూ కలిసి కొన్నాళ్ళు ప్రయాణం సాగించిన అనతరం మంచు తుఫాను వచ్చింది. లియాంగ్ పర్వతాల మధ్య వారిద్దరూ ఈ మంచుతుఫానులో చిక్కుకున్నారు. ఇంకా నాలుగురోజులు నడిస్తే గాని వారు చూదేశం చేరలేరు. కాని ఈ తుఫానులో వారు అడుగు తీసి అడుగువేసే ఆస్కారం లేదు. వారు చలికి చచ్చిపోయే పరిస్థితి ఏర్పడింది. ముఖ్యంగా ముసలి వాడైన తావూ చాలా దీనస్థితిలో ఉన్నాడు. ఆయన అయిూతో ఈ విధంగా అన్నాడు:

"నాయనా, నాపని అయిపోయింది. నేనెలాగూ చూ దేశం చేరలేను. నా చలి బట్టలుకూడా నీవే వేసుకుంటివా ముందుకు సాగగలవు. చూ రాజును సందర్శించగలవు. నాబట్టలిస్తాను, తీసుకో."

దీనికి అయిూ ఎంతమాత్రమూ ఒప్పుకో లేదు. "వెళితే ఇద్దరమూ వెళదాము. లేక పోతే చలికి ఇద్దరమూ చద్దాము. మీ చలి బట్టలు తీసుకుని మీ మరణానికి కారణభూతుణ్ణి కావటానికి అసలే ఒప్పను," అన్నాడు అయిూ.

"నాయనా, నీవు యువకుడివి. నేను కాటికి కాళ్ళు చాచుకుని ఉన్నవాణ్ణి. చూరాజు నాకు సన్మానంచేస్తే ఎంత, చెయ్యకపోతే ఎంత? అదీకాక, నీవు



నాకన్న గొప్ప పండితుడివి!" అని చెప్పి చూశాడు తావూ. అయీ వినిపించుకోలేదు.

మంచునుంచి తప్పించుకోవటానికి వారిద్దరూ ఒక గుహలో తలదాచుకున్నారు.

"ఎక్కడైనా నాలుగు పుల్లలు దొరికితే చలిమంట వేసుకోవచ్చునే!" అన్నాడు తావూ. అయీ పుల్లలకోసం బయటికి వెళ్లాడు.

అయీ తిరిగి వచ్చేలోపుగా తావూ తన చలిబట్టలు విడిచి గుహలో పెట్టి, వెలపల వున్న మంచుగోతిలోకి దూకేశాడు.

అయీ తిరిగి వచ్చి చూసేసరికి గుహలో తావూ బట్టలు మాత్రమే ఉన్నాయి. బయటికి వచ్చి వెతకగా మంచుగోతిలో తావూ శరీరం దొరికింది.

తనకోసం ప్రాణాలు త్యాగంచేసిన తావూ ఔదార్యం తలుచుకుని అయీ చాలా దుఃఖించాడు. అయన శవాన్ని ఆ గుహలోనే భద్రంచేసి, తావూ విసర్జించిన బట్టలు ధరించి, అయీ క్షేమంగా చూదేశం చేరాడు.

చూదేశపు రాజు అయీ పాండిత్యానికి సంతోషించి, తన ఆస్థాన కవిగా నియమించి, చాలా ధనమూ, వస్తువాహనాలూ ఇచ్చాడు.

ఇంత సన్మానమూ పొందుతూ అయీ కంట తడిపెట్టటం రాజు గమనించి, కారణమేమని అడిగాడు.

"ప్రభూ! నా పాండిత్యాన్ని మీరింతగా గౌరవిస్తున్నారు. తావూ ఔదార్యంముందు నా పాండిత్యం ఏపాటి?" అన్నాడు అయీ.

తావూ చేసిన త్యాగం విని రాజు చాలా ఆశ్చర్యపడ్డాడు. ఆయన అయీతోసహా, తావూ శవం భద్రంచేసిన గుహవద్దకు వెళ్లి, వైభవంగా తావూకు అంత్యక్రియలు చేయించి, అక్కడే సమాధి కట్టించాడు.

అయీ ప్రతిఏడూ ఆ సమాధివద్దకు వెళ్లి అశ్రుతర్పణాలు విడిచివస్తూ వుండేవాడు. అయన అనంతరం చీనాదేశంలోని కవి పండితులకు తావూ సమాధి ఒక గొప్ప యాత్రాస్థలం అయింది.





# గర్వభంగం

వారణాసినగరంలో పూర్వం ఒక ఇల్లా లుండేది. తాను మహా పతివ్రతనని అమెకు గర్వంగా ఉండేది. భర్త భోజనం చెయ్యకపూర్వం తాను భోజనంచేసేది కాదు. భర్త ఊరికి వెళ్ళితే ఆయన భోజనం చేస్తాడో లేదో, ఎప్పుడు చేస్తాడో, ఎలాటి భోజనం చేస్తాడో అన్న సంశయంతో పచ్చిమంచినీళ్లు తాగి పస్తులు పడుకునేది.

ఆవిడకు గల ఈ చాదస్తాన్ని చూసి ఇరుగుపొరుగు అమ్మలక్కలు నవ్వుకునేవారు. ఆవిడ మాత్రం ఇతర స్త్రీలను ఆక్షేపించేది.

"మీకు పతివ్రతాధర్మం ఏమీ తెలీదు. భర్త ఏపూట అయినా రాడని తోస్తే భోజనం చేసేస్తారు. ఒకపూట పస్తు పడుకుంటేనేం? భర్త ఊళ్ళో లేకపోతే నిశ్చింతగా మూడు పూటలా ఆరగిస్తారు. పొరుగూరు వెళ్ళిన మనిషి ఏమైనా తిన్నాడో లేదో అన్న విచారమే ఉండదు మీకు. నేనెన్నడూ అలా చేయలేను," అని ఉపన్యాసాలుదంచేది.

ఈ ఉపన్యాసాలు విన్నవాళ్లకి కోపాలు రాసాగాయి. "ఈవిడ తన చాదస్తం మనకు కూడా అంటగట్ట ప్రయత్నిస్తుందేమిటి?" అని వారిలో వారు అనుకుని, తమ భర్తలతో చెప్పారు. వారు ఆమె భర్తఎదట ఆమెను గురించి కొంచెం వెటకారంగా మాట్లాడసాగారు.

ఇదంతా భరించలేక ఆమె భర్త ఆమెకు మంచి గుణపాఠం నేర్పి ఆమెకు గర్వభంగం చేయాలనుకున్నాడు. ఆయన రోజూ భోజనానికి ఆలస్యంగా రాసాగాడు. ఒక్కొక్కపూట అసలు భోజనానికి వచ్చేవాడేకాడు.

ఒకోసారి ఉన్నట్టుండి హఠాత్తుగా భార్యకు చెప్పకుండాపొరుగూరు వెళ్లి రెండు మూడు రోజులదాకా వచ్చేవాడుకాడు.

ఆర్. భీమారావు

ఇందువల్ల అతని భార్యకు చాలా ఇబ్బంది కలుగుతూండేది. అయినా ఆవిడ పతివ్రతాధర్మాన్ని పళ్ళబిగువున ఆచరిస్తూ అవస్థపడుతూండేది. భోజనంవేళకు సరిగా ఇంటికి రమ్మని భర్తను కోరేది.

ఒక ఉదయం వంటవేళకు భర్త భార్యతో, "ఏమే, ఇవాళ పంచభక్ష్య పరమాన్నాలు చెయ్యి. సుఖంగా భోజనంచేసి చాలా కాలమయింది," అన్నాడు.

భార్య సంతోషించింది. ఆమెకూడా సుఖంగా భోజనంచేసి చాలాకాలమయింది. "భోజనానికి ఆలస్యంచేయక వేళకు రండి!" అని భర్తను హెచ్చరించి, వంటఇంట్లోకి వెళ్ళి, తనకిష్టమైన పిండివంటలూ, కూరలూ, పరమాన్నమూ చేసి భర్తకోసం ఎదురుచూడసాగింది.

కాని ఎంతసేపు చూసినా భర్త రాడు. చివరకు మిట్టమధ్యాన్నం దాటినాక ఆయన వచ్చాడు.

"ఎప్పుడనగా వంట అయింది! భోజనానికి రండి," అన్నది భార్య.

"ఇదుగో, చెరువులో స్నానం చేసి క్షణంలో వస్తాను," అంటూ భర్త గబగబా వెళ్లిపోయాడు. కాని ఆయన ఎంతకూ రాడు! భార్యకు ఒకవంక ఆకలి దహించుకుపోవటమే గాక, తన కిష్టమైన వంట



కాలు ఎదురుగా కనిపించటంవల్ల మరింత బాధగా ఉంది.

పూర్తిగా రెండుగంటలు గడిచాక భర్త వచ్చాడు. వచ్చాడుకదా అని భార్య సంతోషించింది. కాని లోపలికి వస్తూనే ఆయన కాస్తా కళ్ళు తేలవేసి నట్టింటో విరుచుకు పడిపోయాడు. భార్య దగ్గిరికి వెళ్ళి చూసే సరికి, రెండుగంటలపాటు చెరువులో నానిన భర్తశరీరం భార్యచేతికి చల్లగా, తగిలింది.

భర్త చచ్చిపోయా డనుకున్నది భార్య. ఏడిచి కేకలు పెడితే నలుగురూ వచ్చి చూసి ఆయన ప్రాణం పోయిందో లేదో తేల్చిచెబుతారు. కాని నిజంగా ప్రాణం పోయేవుంటే తన నోట మట్టే! చేసిన వంట కాలు ముట్టుకునే యోగం ఉండదు. తినదలిస్తే భర్తస్థితి తేలకముందే తినాలి.

భార్య చప్పున వంటఇంటోకి వెళ్ళి తన కిష్టమైన వంటకాలన్నీ కడుపునిండా తినేసింది. అమె చెయ్యి కడుక్కొని తిరిగి వచ్చేసరికి నట్టింట భర్త ఇంకా అదే తీరుగా పడిఉన్నాడు.

అప్పుడా యిల్లాలు, "అయ్యో దేవుడా!" అని శోకాలు ప్రారంభించింది. నలుగురూ చేరారు, "ఏమిటేమిటి?" అని అడిగారు.

"చేసిన పిండివంటలైనా తినకుండా పోయావా, దేవుడా?" అని శోకాలుపెట్టింది.

"నే తినకపోయినా నువు తిన్నావు గాదుటే?" అంటూ భర్త లేచి కూచున్నాడు.

చూడవచ్చిన వారందరికీ జరిగినదంతా తెలిసిపోయింది. భర్త చేసిన మోసానికి భార్యకు చచ్చే సిగ్గయిపోయింది.

"ఈ భాగ్యానికేనా, తల్లీ మాఅందరికీ పాతివ్రత్యం బోధించావు?" అంటూ అమ్మలక్కలంతా ఆవిణ్ణి దెప్పుడుమాట లని మరీ వెళ్ళారు.

అదిమొదలు ఆ యిల్లాలు ఎవరికీ పతివ్రతాధర్మాలు బోధించి ఎరగదు, ఇతర స్త్రీలనుగురించి వేళాకోళం చేసిఎరగదు.






## 14

[సమరసేనుడు, శివదత్తుడి భటులతో కలిసి అతడున్న పల్లెకు బయలుదేరాడుగదా? అతడు పల్లెను సమీపించేసరికి వ్యాఘ్రదత్తుడి సైనికులు పల్లెను కాల్చివేయటం కనిపించింది. అక్కడ శివదత్తుడి భటుడొకడు తమ నాయకుడు పారిపోయాడని చెప్పాడు. అతడికోసం బయలుదేరిన సమరసేనుడు కొండలమధ్య చిక్కుకుపోయాడు. తరవాత—]

సమరసేనుడు ఒక పెద్ద రాయివెనక దాక్కుని ఏనుగుకేసి చూస్తున్నాడు. అతడి వెంటవున్న సైనికులుకూడా ప్రాణాలు అరచేత పెట్టుకుని వణికిపోతున్నారు. ఒక గొప్ప ఏనుగులమంద ఆ సారంగంనుంచి వెలువడి తమను నుగ్గునుగ్గుగా తొక్కివేస్తుందేమో అని వాళ్ళ భయం. వాళ్లు చాలా చిన్నజాగాలో చిక్కుకుపోయారు. అక్కడనుంచి పారిపోవాలంటే సులభం కాదు. అన్నివైపులా ఎత్తుగా వున్న కొండరాళ్ళు మార్గాన్ని ఆటంకపరుస్తున్నవి.

ఇలా భయంతో కంపించిపోతున్న సైనికులకూ, సమరసేనుడికీ ఒకేసారి ఇద్దరు ముగ్గురు అరిచినట్టు ఆర్తనాదం వినిపించింది. ఆ ధ్వని గుహకు అవతల భాగాన్నుంచి వస్తున్నది. కాని తాము వున్న చోటునుంచి బయటకు రావటం ఎలా?

అందరూ ఇలాంటి ఆలోచనలతో తికమక అవుతూండగా, ఏనుగు అన్నిదిక్కులూ పరికించిచూసి పెద్దగా ఘీంకరిస్తూ—యిదివరకు సమరసేనుడూ, సైనికులూ వచ్చిన గుహలోకి జొరబడింది. కొద్దిసేపట్లోనే అది





అది నిజంగా ఆర్తనాదమా లేక..." సమర సేనుడు యిలా చెపుతూండగానే గుహ అవతలనుంచి పెద్ద కల్లోలం జరుగుతున్నట్టు అరుపులు వినిపించినై.

సమరసేనుడు యిక ఆలోచించి లాభం లేదనుకున్నాడు. గుహకు అవల వున్నవాళ్లు శత్రువులైనా, మిత్రులైనా—ఏదో ప్రమాద పరిస్థితిలో వున్నారు. కనుక ధైర్యంగా ముందుకు పోయి అదేదో తెలుసుకోవటం అవసరమనుకున్నాడు.

సమరసేనుడు సైనికులను హెచ్చరించి ముందు నడిచాడు. సన్నని గుహలోనుంచి కొద్దిదూరం నడిచేసరికి అవల గుహద్వారం, దానిని అనుకునే ఒక నీటిమడుగూ కనిపించినై. ఆ నీటిమడుగులో ఊడలు దించుకున్న కొన్ని చెట్లూ, బాగా ఎత్తుగా పెరిగిన నీటిజమ్మూ వుంది.

సమరసేనుడు మరికొద్ది దూరం వెళ్లేసరికి ముగ్గురు మనుష్యులు మోకాలు బంటి నీటిలో స్తంభాలకు బంధింపబడి వుండటం కంటబడింది. సమరసేనుణ్ణి చూడగానే వాళ్ళు మరింత పెద్దగా అరుస్తూ గోలచేయసాగారు.

పరిస్థితి ఏమిటో సైనికులకుగాని సమరసేనుడికిగాని అవగాహన కాలేదు. స్తంభా

జలపాతంలోనుంచి పోతూన్నట్టు నీరు కలియబెట్టబడిన శబ్దం వినిపించింది.

ముందుగా సమరసేనుడు తను దాక్కున్న చోటునుంచి బయటికి వచ్చాడు. ఆవెంటనే సైనికులు బయటికివచ్చి అతణ్ణి సమీపించారు. గుహకు అవతలనుంచి వస్తున్న ఆర్తనాదం మధ్యమధ్య వినబడుతూనె వుంది.

"ఎవరో మహా విపత్తులో చిక్కుకున్నట్టుంది?" అన్నాడు ఒక సైనికుడు.

"అందుకు సందేహంలేదు. కాని ఏనుగు అంత హఠాత్తుగా అటునుంచి ఎందుకు పారిపోయి వచ్చివుంటుంది? బహుశా శత్రువులు మనకోసం పన్నిన వల కాదుగదా?



లకు కట్టబడివున్న వ్యక్తులకు తక్షణం దాపురించబోతున్న ప్రమాదం ఏమీవున్నట్టు లేదు. వారి పక్కలగాని, చుట్టుపక్కల గాని ఎవరూ లేరు. తమను చూచికూడా, వాళ్ళెందుకు అంత పెద్దగా అరుస్తున్నారు? అన్న ఆశ్చర్యం సమరసేనుడికి కలిగింది.

బంధింపబడివున్న ముగ్గురనూ చేరాలంటే సమరసేనుడు నీటిమడుగులో దిగి కొంతదూరం వెళ్లాలి. మడుగు అంతలోతు కాదని అక్కడ పెరిగిన నీటిజమ్మునుబట్టి తెలుస్తూనే వుంది. సమరసేనుడు కత్తీ, అంబులపొదీకూడా సర్దుకుని నీటిలో దిగాడు. సైనికులు అతణ్ణి అనుసరించి నడుస్తున్నారు. వారు మడుగులో కొద్ది దూరం నడిచేసరికి, కర్ణపుటాలు బద్దలయేలా ముగ్గురు బంధితులూ ఒక్కసారి కేకపెట్టారు. మరుక్షణంలోనే నీటి మడుగంతా అల్లకల్లోలం అయిపోయింది.

సమరసేనుడు నివ్వెరపోయి చూస్తున్నాడు. ఎదురుగా పెద్ద మొసలి నోరుతెరచి అతడి వైపుకే వస్తోంది. క్షణంలో అతడు పరిస్థితి గ్రహించాడు. బంధితులు అంత గోలచేయటానికి కారణం యీ భయంకరమైన మొసలే!

కత్తి ఒరలోపెట్టి సమరసేనుడు బాణం ఎక్కుపెట్టాడు. మొసలి పెద్దగా నోరు






తెరిచి కోరలు చాస్తూ ముందుకు రాసాగింది. దానిని కొంచెం దగ్గరకు రానిచ్చి సమర సేనుడు బలంకొందికి బాణాలు దాని నోట లోకి గురిగా కొట్టాడు. ఆ దెబ్బతో మొసలి నీటిలో ఒక క్షణకాలం గిలగిల కొట్టుకుని, తిరిగీ ముందుకు రాసాగింది. మెరుస్తున్న దాని కళ్ళు భయం కలిగిస్తున్నవి.

ఈసారి సమరసేనుడు తన కత్తితో దాని మీదికి లంఘించి బలంగా దాని వెన్ను మీద రెండు పోట్లు పొడిచాడు. మొసలి చావుదెబ్బలు తిని నీటిలో తన్నుకోసాగింది. భయకంపితులై చూస్తున్న సైనికులకు ప్రాణం తెప్పరిల్లినట్టయింది.



తరవాత స్తంభాలకు కట్టివేయబడిన వాళ్ళను సమీపించాడు సమరసేనుడు. వాళ్ళ ముఖాలు చూడగానే సమరసేనుడికి కలిగిన ఆశ్చర్యం అంతా యింతా కాదు. ఆ ముగ్గురూ—తను గుహలో వ్యాఘ్రదత్తుడి భటులవల్ల బంధింపబడక పూర్వం తనతో వున్నవాళ్లు. కాని నాలుగోవా డేమయినట్టు?

సమరసేనుణ్ణి చూడగానే ఆ ముగ్గురు సైనికులూ అమితాశ్చర్యం చెందారు. వారి ఆనందానికి మేరలేదు. తలవని తలంపుగా ప్రాణరక్షణ జరగటమే కాక, తమ నాయకుడు కూడా కనిపించాడు.

"సేనానీ, మిమ్మల్ని చూడగలమని అనుకోలేదు," అన్నాడు ఒక సైనికుడు.

"ఆ నాలుగో సైనికుడెక్కడ?" అని అడిగాడు సమరసేనుడు.

"సేనానీ, అతణ్ణి మీరు చంపిన మొసలి పొట్టన బెట్టుకున్నది. సమయానికి మీరు రాకున్నట్టయితే మేమూ అతడి దారినే పోయేవాళ్లం," అని జవాబిచ్చారు సైనికులు.

"మీరు ఎవరివల్ల యీవిధంగా బంధింపబడ్డారు?" అని అడిగాడు సమరసేనుడు.

సైనికులు జరిగినదంతా కొద్దిలో చెప్పారు. తమ నాయకుణ్ణి వెతుక్కుంటూ వాళ్ళు కూడా గుహలోని రహస్యద్వారం





గుండా యీ ప్రాంతానికి వచ్చారు. ఇక్కడ వారిని వ్యాఘ్రదత్తుడి భటులు బంధించి, తమ నాయకుడి ఆజ్ఞప్రకారం, యీ మడుగులో మొసలికి ఆహారంగా విడిచిపుచ్చారు.

"మమ్మల్ని వాళ్ళు యిక్కడ బంధించి వెళ్ళిపోయి ఎంతోకాలం కాలేదు. ఆ చెట్ల చాటునుంచి పరికిస్తే వాళ్ళు వెళ్లేమార్గం కనబడుతుంది," అన్నారు సైనికులు.

అందరూ అక్కడ వున్న చెట్లచాటుకు వెళ్లి చూశారు. వ్యాఘ్రదత్తుడు తన భటులతో బారులుతీరి పోతూవుండటం వాళ్లకు కనిపించింది. సమరసేనుడు వ్యాఘ్రదత్తుడి మూకను చూడగానే పళ్లు కొరికాడు. కాని తనదగ్గరవున్న కొద్దిమంది సైనికులతో తను చేయగలిగింది దేమీలేదు. ముందు శివదత్తుడి వునికి ఎక్కడో తెలుసుకోవటం ముఖ్యం.

సమరసేనుడు యిలా ఆలోచించేటంతలో ఒక సైనికుడు చిన్న కేకవేసి చెట్టుకొమ్మలకేసి చేయి చూపాడు. అక్కడ ఒక కొమ్మనుంచి ఒక కాయితం వేళ్లాడుతోంది. సమరసేనుడు ఆశ్చర్యపోయి దానిని అందుకొని ఆతృతగా విప్పి చూశాడు. అందులో యిలా రాయబడివుంది:

"ఇది భయంకర ప్రదేశం. త్వరగా ఈ ప్రాంతాన్ని విడిచిపొండి."



అది శివదత్తుడి హెచ్చరికే అని సమరసేనుడు గ్రహించాడు. చాలా హడావిడిలో రాయబడినట్టు, కుదురుగా లేని అక్షరాలను బట్టి తెలుస్తూనే వుంది. వెంటనే అక్కడినుంచి కదలటం క్షేమమని నిర్ణయించుకున్నాడు సమరసేనుడు.

సమరసేనుడు వచ్చినదారినే వెనక్కు పోదలిచాడు. కాని ఒక సైనికుడు ఒక గుహకేసి చూపుతూ, "చూడండి, ఈ గుహ వైపుకు చాలామంది మనుషులు నడిచినట్టు మార్గం కనబడుతోంది," అన్నాడు.

సమరసేనుడు అటుకేసి నాలుగైదడుగులు వేసి పరీక్షించి చూశాడు. సైనికుడు





చెప్పినది నిజమే అనిపించింది. ఒకవేళ శివదత్తుడు యీ మార్గంనుంచే ప్రయాణించాడా అన్న అనుమానంకూడా అతడికి కలిగింది.

సమరసేనుడు గుహను సమీపించి లోపలకు తొంగిచూశాడు. అంతా చీకటి మయం. సైనికులలో ఒకడు కాగడా వెలిగించగా, ఆ వెలుగులో ముందుకు నడిచాడు.

కొంచెందూరం వెళ్ళేసరికి వాళ్ళకు కనబడిన దృశ్యం భయాన్నీ, ఆశ్చర్యాన్నీ కూడా కలిగించింది. ఒకచోట రాతితో చెక్కబడిన సింహాసనం! దానిచుట్టూ మానవాకారంలో వున్న విగ్రహాలు! వాళ్ళ పోలికలూ, ధరించిన ఆయుధాలూ చూస్తే అటవికులలా కనబడ్డారు.

"ఇది ఎవరో ఆటవిక నాయకుడి సమాధి స్థలం కావొచ్చు! ఏదయినా- యింత భయంకర ప్రదేశాన్ని నే నెక్కడా చూడలేదు. ఆ అటవికుల భయంకర విగ్రహాలు చూస్తూంటే—నాకు ఏకాకిమాంత్రికుణ్ణి చూసినప్పటికంటె ఎక్కువ భీతి కలుగుతోంది," అన్నాడు సమరసేనుడు.

తమ నాయకుడే యిలా అనేసరికి యిక సైనికుల భయానికీ, భీతికీ కట్టలు తెగినై. వాళ్ళు ఒకరి ముఖాలు ఒకరు చూసు



కొన్నారు. మరీ భీతిచెందిన ఒక సైనికుడు వెనక్కు పారిపోసాగాడు.

సమరసేనుడు తను అనాలోచితంగా అన్న మాటలకు చాలా నొచ్చుకున్నాడు. నాయకుడు ఎన్నడూ, ఎలాంటి పరిస్థితులలోనూ భయపడుతూన్నట్టు బయటకు తెలియనీయకూడదు.

సమరసేనుడు తతిమ్మా సైనికులకు ధైర్యంచెప్పి, గుహద్వారంకేసి బయలుదేరాడు. ఈ ప్రదేశాన్ని ఎంత త్వరగా వదిలిపోతే, తనకూ తన సైనికులకూ అంత క్షేమం అనిపించిందతడికి. శివదత్తుడు ఎక్కడ వున్నదీ తెలుసుకోవటం చాలా



కష్టసాధ్యంగానే కనిపించింది. శివదత్తుడి సంగతి వదిలేసి–తను తిరిగి బయలుదేరిన చోటుకు వెళ్ళిపోదామా అనుకున్నాడు. కాని అక్కడా పరిస్థితులు తనకేమంత అనుకూలంగా లేవు. ఒకవైపున ఏకాకిమాంత్రికుడి బెడద, రెండోవైపున కుంభాండుడు!

ఎన్ని కష్టాలకైనా వోర్చి శివదత్తుణ్ణి కలుసుకోవటమే ఉత్తమం అనుకున్నాడు సమరసేనుడు. దేవీప్రసాదితమైన త్రిశూలం ఎక్కడవున్నదీ అతడికి తెలుసు. ఏకాకి, చతుర్నేత్రుల గుహవైన శాక్తేయుడిది ఆ త్రిశూలం. కనుక దాని శక్తికి తిరుగు వుండదు!

కాని శివదత్తుడి ధోరణికూడా సమరసేనుడికి కొంత అనుమానం కలిగించింది. నిజంగా ఆతడు తనకు మిత్రుడా లేక అలా నటించుతున్నాడా?

నావలోని ధనరాసులూ, దాన్ని కాపాడుతున్న నాగకన్యా—వీళ్ళందరికీ తెలుసునన్నదీ నిజం. ఏకాకిమాంత్రికుడూ, చతుర్నేత్రుడే కాక వాటికోసం వ్యాఘ్రదత్తుడూ, శివదత్తుడూకూడా ప్రయత్నిస్తున్నారు. ఈ అందరి కొట్లాటలమధ్యా చిక్కుకుని తను అనవసరంగా కష్టాలపాలవుతున్నాడు.

ఇలా ఆలోచిస్తూ సమరసేనుడు గుహ బయటికి వచ్చాడు. ఎటు పోవటమా అని అతడు ఆలోచించేటంతలో పెద్ద కేకలు వినబడటం, ఆ వెంటనే బరిశెలూ, బాణాలూ విసురుగా మీదికి రావటం జరిగింది.

"శత్రువులు! రాళ్ళచాటుకు పరుగెత్తండి!" అని అరుస్తూ సమరసేనుడు రాళ్లగుట్టలకేసి పరుగెత్తాడు. భీకరంగా అరుస్తూ కొండలపైనుంచి బాణాలవర్షం కురిపిస్తూ చాలామంది సైనికులు కనిపించారు. వారెవరు? వ్యాఘ్రదత్తుడి సైనికులా, లేక కుంభాండుడి ఆటవికులా?

—(ఇంకా వుంది)





# నిర్విచారుడు

పూర్వం ఒక రాజుండేవాడు. ఆయనకు సమస్త భోగభాగ్యాలూ ఉండేవి. దేశం సుభిక్షంగా వుంది. ప్రజలలో అశాంతి ఏమాత్రం లేదు. అయినా తనకు తగినంత సుఖంలేదని రాజుకు సందేహంగా ఉండేది.

"నాకన్న సుఖంగా ఉన్నవారెవరైనా దేశంలో ఉన్నారా?" అని రాజు తన మంత్రులనూ, సామంతులనూ అప్పుడప్పుడు అడుగుతూండేవాడు.

"మహాప్రభో! అది అసంభవం. ఈ రాజ్యంలోనే కాదు. భూమండలంలో ఎక్కడా తమకంటె సుఖి అయినవాడు ఉండేటందుకు ఎంతమాత్రం వీలులేదు," అని వాళ్లు సమాధానం చెప్పేవారు.

రాజుకి సమాధానం తృప్తి కలిగించేది కాదు. ఆయన ఒక సాయంకాలం మారువేషంలో సమీపాన గల ఒక పల్లెలో తిరుగుతూండగా, ఒక పూరిగుడిసెలోనుంచి ఏకతార మీటిన చప్పుడూ, ఆ వెంటనే శ్రావ్యమైన పాటా వినిపించాయి.

"ఆ పాట పాడే మనిషి పేదవాడే కావచ్చు. కాని వాడు నాకన్న నిర్విచారంగా ఉన్నట్టు కనబడుతున్నాడు. నేనలా నిశ్చింతగా పాడుకోలేను," అనుకుని రాజు ఆ గుడిసెలోకి తొంగిచూశాడు.

గుడిసెలో చిన్న గుడ్డిదీపం వెలుగుతున్నది. రాజు యీడువాడే ఒకడు చాప మీద కూచుని ఏకతార మీటుతూ మహదానందంగా గొంతెత్తి పాడుతున్నాడు. వాడు మారువేషంలో వున్న రాజును చూడగానే, "రా, అన్నా! లోపలికి వచ్చి కూచో," అని ఆహ్వానించాడు.

రాజు లోపలికి వెళ్లి కూచుని, "చాలా ఆనందంలో వున్నట్టున్నావు. నీకేమీ విచారంలేదా? జీవితం ఎలా గడుస్తున్నది?" అని అడిగాడు.

ఎస్. గోవింపరావు




"నాకు ఏ చీకూ చింతా లేదు. రోజూ ఉదయమే లేచి నగరంలోకి వెళతాను. వీధి వీధి తిరుగుతాను. గిన్నెలకు మాట్లు వేస్తాను, కళాయి చేస్తాను. నాలుగుడబ్బులు సంపాదించుకుంటాను. నాకు కావలిసిన కూరా నారా కొనుక్కుంటాను. ఇంటికి వచ్చి వంట చేసుకుని తిని, నిద్ర వచ్చేదాకా నిశ్చింతగా పాడుకుంటాను. నే నెవరినీ పోషించను, నన్నెవరూ పోషించ నవసరంలేదు. డబ్బు దాచాలనే చింతకూడా లేదు. ఎందుకు విచారం?" అని అడిగాడు పాటగాడు.

రాజు అక్కడ మరి కాస్సేపు కూచుని తనదారిన తాను వచ్చేశాడు. మర్నాటి నుంచీ గిన్నెల మరమ్మతు కళాయి మొదలైనవన్నీ కోటలోనే చేయించుకోవాలనీ, వీధులవెంట వచ్చేవారిచేత చేయించుకోరాదనీ అయన శాసించాడు.

ఆరోజు నగరానికి వచ్చిన పాటగాడికి దమ్మిడీకూడా దొరకలేదు. వాడు వీథి వెంబడి ఆలోచిస్తూ పోతూండగా ఒక ఇంటి ముందు కట్టెలు పేళ్లువేస్తూ ఒక పెద్ద మనిషి కనిపించాడు. పాటగాడు అయనతో: "అయ్యా, మీకెందుకువచ్చిన శ్రమయిది. నేను కట్టెలు పేళ్ళు వేసి పెడతాను. నా కష్టానికి తగినవిధంగా కూలిడబ్బిప్పించండి," అన్నాడు.

"కూలివాడు దొరక్కనే చెయిచేసుకోవలసి వచ్చింది," అంటూ ఆ పెద్దమనిషి పాటగాడి చేతికి గొడ్డలి ఇచ్చాడు. అది మొదలు పాటగాడు రోజూ నగరానికి వచ్చి, ఇల్లిల్లూ తిరిగి, కావలసినవారికి కట్టెలు కొట్టిపెట్టి, తనకు చాలినన్ని డబ్బులు దొరకగానే ఇంటికి వెళ్లిపోయి, వంటచేసుకుని భోజనంచేసి నిశ్చింతగా ఏకతారమీద పాడుకుంటూ రోజులు గడపసాగాడు.

వాడి స్థితి ఇప్పు డెలా ఉన్నదీ తెలుసుకోవటానికై మారువేషంలో ఒకనాటి సాయంకాలం రాజు వాడి గుడిసెవైపు వెళ్లాడు.

మామూలుకు భిన్నం ఏమాత్రమూ లేకుండా పాట వినిపిస్తోంది. రాజు చాలా ఆశ్చర్య పడ్డాడు. ఆయన గుడిసెలో ప్రవేశించి, జరిగిన సంగతి తెలుసుకున్నాడు.

ఆ పాటగాడి నిర్వాహానికి కాయ కష్టం చెయ్యటమే అయిఉంటుందనుకుని, అవునో కాదో తెలుసుకోవటానికి ఒక ఉపాయం చేశాడు.

మర్నాడు ఉదయమే రాజభటులు పాటగాడి గుడిసెవద్దకు వెళ్ళి తలారి పిలుస్తున్నాడని చెప్పారు. మారు మాటాడ కుండా పాటగాడు రాజభటులవెంట తలారి వద్దకు వెళ్ళాడు.

"నిన్ను రాజభటుడుగా నియమించ మని దివాణంనుంచి ఉత్తరువు వచ్చింది. కనుక నీవు వెంటనే దివాణానికి వెళ్ళి పనిలో ప్రవేశించు," అని చెప్పాడు తలారి.

పాటగాడు దివాణానికి వెళ్ళి, తనకీ ఉద్యోగం అవసరంలేదని, తనకు బాగానే జరిగిపోతున్నదని విన్నవించుకున్నాడు. కాని లాభం లేకపోయింది. వాడు ఎంత మొరపెడుతున్నా వినక వాడికి రాజభటుడి దుస్తులూ, తలపాగా, కత్తీ ఇచ్చారు.

ఈ కొత్త ఉద్యోగంలో పాటగాడికి నెల జీతమే గాని రోజుకూలి లేదు. ఏమి చెయ్యా టానికీ పాలుబోక వాడు ఒక వర్తకుడి







"వీడింకా నిర్విచారంగానే వున్నాడు. నేను ప్రజలను దండిస్తూంటాను గనక నా మనస్సుకు సుఖంలేకుండా వుందేమో! వీడిచేతకూడా ఎవరినైనా దండింపజేస్తాను!" అనుకున్నాడు రాజు.

మర్నాడు పాటగాడిని వధ్యశిలవద్దకు వెళ్ళమని ఆజ్ఞ అయింది. వాడక్కడికి వెళ్లేసరికి శిలవద్ద ఒక ఖైదీ వున్నాడు. పక్కన తలారి వున్నాడు. ఖైదీ శిరచ్ఛేదం చూడటానికి వచ్చిన ప్రజలు చుట్టూ గుమిగూడి వున్నారు.

"ఈ ఖైదీకి రాజుగారు మరణదండన విధించారు. నీ కత్తితో వీడి మెడ నరికెయ్యి!" అని పాటగాణ్ణి తలారి ఆజ్ఞాపించాడు.

పాటగాడికి పెద్ద సమస్యే పట్టుకున్నది. కొయ్యకత్తితో మనిషితల ఎలా నరకటం?

"బాబూ, ఈ మనిషి ఏమిదోషం చేశాడో నాకు తెలియదు. ఈ పని నాకెందుకు పెడతారు? మరెవరినైనా నియమించండి!" అని వాడు తలారిని వేడుకున్నాడు.

"వాడి దోషంతో నీకేంపని? నీవు వాడి తల నరకాలని రాజుగారి ఉత్తరువు. తల నరకటం నీవిధి," అన్నాడు తలారి చాలా కఠినంగా.

వద్దకు వెళ్ళి తన కత్తి కుదువబెట్టి రోజూ తనకు కావలిసిన డబ్బులు వర్తకు డిచ్చేటట్టూ, తన నెలజీతంతో బాకీ తీర్చివేస్తూ ఉండేటట్టూ ఏర్పాటు చేసుకున్నాడు.

అయితే కత్తి లేని ఒర తెలిసిపోతుంది గనక ఒక ఉపాయం ఆలోచించాడు. వడ్రంగివద్దకు పోయి ఒక కొయ్యకత్తి చేయించి దానిని ఒరలో పెట్టుకుని మామూలుగా తిరగసాగాడు.

కొద్దిరోజులు గడవనిచ్చి రాజు మారు వేషంలో మరోసారి వాడి గుడిసెకేసి వెళ్లాడు. గుడిసెలోనుంచి ఇంకా పాట వినిపిస్తూనే వుంది.



ఇక తప్పించుకునే మార్గం లేదు. పాటగాడు కళ్ళు మూసుకుని, తల ఆకాశానికి తిప్పి, చేతులు జోడించి "పరాత్పరా! నేనొక ఘోర కార్యం చేయబోతున్నాను. ఈ ఖైదీ నిర్దోషి అయినపక్షంలో నా కత్తిని కొయ్యకత్తిగా మార్చివేసి, నన్ను పాపం నుంచి తప్పించు" అని అందరికీ వినబడేలాగు ప్రార్థనచేశాడు.

తరువాత ప్రజలందరూ చూస్తూండగా ఒరనుండి సర్రున కత్తి పైకి దూశాడు.

పాటగాడు పైకి దూసిన కత్తి కొయ్యకత్తి కావటంచూసి క్షణంసేపు ప్రజలు నిశ్చేష్టితులై నిలబడిపోయారు. ఆతరవాత, "ఖైదీ నిర్దోషి! వాణ్ణి వదలాలి!" అని జనంలోనుంచి కేకలు వెలువడ్డాయి. తలారి కూడా తెల్లబోయి చూస్తున్నాడు.

ఈలోపల జనం తోసుకుని ముందుకు వచ్చారు. వాళ్ళల్లో కొందరు భక్తితో పాటగాడి కాళ్లపై పడి:

"అహా! ధర్మస్వరూపుడు! మహాపురుషుడు!" అన్నారు. మరికొందరు పరుగెత్తుకువెళ్లి ఖైదీ చేతికట్లు విడగొట్టారు.

ఖైదీ నిర్దోషి అనీ, రాజభటుడు మహాత్ముడనీ నగరమంతా కార్చిచ్చులాగా పాకిపోయింది. తలారి అసహాయుడై రాజు వద్దకు పోయి జరిగినదంతా విన్నవించుకున్నాడు. రాజుకు ఆశ్చర్యమూ, అనుమానమూ కలిగాయి. ఆయన పాటగాణ్ణి తనవద్దకు పిలిపించి, జరిగినదంతా దాచకుండా చెప్పమన్నాడు.

పాటగాడు తన కత్తిని కుదవబెట్టిన వృత్తాంతం దాచకుండా చెప్పాడు.

రాజు వాడికి కొంత డబ్బిచ్చి, "నిన్ను మేము ఇక బాధించబోము. నీ యిష్టం వచ్చినట్టు బతుకు," అని పాటగాణ్ణి పంపేశాడు. ఇక ఆనాటినించీ తనమానాన తాను బతకగోరేవాడికి విచారం ఉండదని రాజు తెలుసుకున్నాడు.





# పండితపుత్రుడు

ఒకప్పుడు ప్రయాగనగరానికి ప్రదీపుడు రాజు. ఆయన ఆస్థానంలో అనేకమంది పండితు లుండేవారు. వారిలో కొందరు చాలా తరాలుగా ఆస్థానపండితులుగా ఉంటున్నవారు. అలాటివారిలో బద్రీప్రసాద్ అనేవాడొక డున్నాడు.

బద్రీప్రసాద్ తండ్రి, తాత, ముత్తాతలు గొప్ప పండితులు, ప్రయాగనగరపు ఆస్థానంలో ఉండినవారు. అయితే బద్రీప్రసాద్ మటుకు కేవలం పండితపుత్రుడు—అంటే వట్టి శుంఠ. ఏళ్ళతరబడి వినటంవల్ల అతనికి వేలకొద్దీ శ్లోకాలు కంఠతఃవచ్చుగాని కొంచెమైనా ప్రపంచజ్ఞానం లేదు. పరమ మూఢుడు. ఈ సంగతి రాజుకు తెలియదు.

అయితే ఆస్థానంలో ఉండే తతిమ్మా పండితులు బద్రీప్రసాద్ విషయం సులువుగా కనిపెట్టారు. అటువంటి మూఢుడికి తమతో సమానమైన స్థానం ఉండటం వారికి ఏమాత్రమూ సమ్మతంకాలేదు. అందుచేత వారు రాజుదగ్గిరికి వెళ్ళి, "మహాప్రభో! బద్రీప్రసాద్ ప్రపంచజ్ఞానం లేని వెర్రిబాగులవాడు. అతనికి ఆస్థానపదవి ఇవ్వటం ఆస్థానానికే అప్రతిష్ఠ. అతని తెలివితేటలు మీరే స్వయంగా పరీక్షించి చూడవచ్చు," అన్నారు.

ప్రదీపుడు ఆశ్చర్యపోయాడు. ఎందుకంటే బద్రీప్రసాద్ తండ్రి దిగ్గజంలాటి పండితుడు. ఆయన చనిపోగానే ఆ స్థానం బద్రీప్రసాద్‌కు లభించింది. విభూతిరేఖలూ, శాలువా, కర్ణకుండలాలూ ధరించి బద్రీప్రసాద్ చూడటానికి అందరు పండితుల్లాగే ఉన్నాడు. వాస్తవంగా ఎంత మూఢుడో పరీక్షించుదామని రాజుగారు ఒకనాడు సభలో బద్రీప్రసాద్‌ను యిలా అడిగాడు:

"పండితోత్తమా! కొందరు మనుషులు తాబేళ్లను పట్టుకుంటుండగా చూశాను.

కె. నరసింహారావు

వారికి తాబేళ్లవల్ల ప్రయోజనమేమిటో నాకు అర్థం కాలేదు,"

ఇది విని బద్రీప్రసాద్ "మహారాజా! తాబేలుపాలు చాలా రుచిగా ఉంటాయి. వాటి బొచ్చుతో కాశ్మీరుశాలువలు నేస్తారు," అన్నాడు తడుముకోకుండా.

రాజుకు ఆశ్చర్యంవేసింది. కాని సభలో కొందరు నవ్వారు. బద్రీప్రసాద్ మూఢుడని తేలిపోయింది. రాజు ఈవిధంగా అడిగాడు:

"పండితోత్తమా! నేనొక విడ్డూరమైన వార్త విన్నాను. ఒక కుందేలు గర్జిస్తూ సింహంమీడికి దూకిందట. ఇది నిజమై ఉండవచ్చునా?"

"అందులో విడ్డూరం ఏమీలేదు, మహారాజా! సింహాలు కుందేళ్లకు సహజమైన ఆహారమే. కుందేలు సింహంమీదికి ఉరికి దాని కుంభస్థలం పగలగొట్టి తింటుందని శాస్త్రాలలో చెప్పి ఉన్నది," అన్నాడు బద్రీప్రసాద్.

ఈసారి సభికులు మరింత గట్టిగా నవ్వారు. రాజుగారికికూడా నవ్వు వచ్చింది.

"అయితే, పండితోత్తమా, నేనొకసారి తగలబడుతున్న చెరువును చూశాను. ఆ చెరువులో నాకు ఒక్క చేపకూడా కనిపించ లేదు. కారణం ఏమై ఉంటుంది?" అని అడిగాడు రాజు.

"చెరువు తగలబడుతున్నదిగదా. అందు చేత చెరువులోని చేపలు ఒడ్డుకు వచ్చి సమీపాన గల చెట్లెక్కి ఉంటవి!" అన్నాడు బద్రీప్రసాదు.

"తామే చూశారుగదా, మహారాజా! ఈ మూఢుణ్ణి తక్షణమే ఆస్థానంనుంచి పంపి వేయండి!" అన్నారు పండితులు రాజుతో.

"ఇంత హాస్యం పుట్టించగలవాణ్ణి ఆస్థానంనుంచి వెళ్ళగొట్టటం మా కిష్టం లేదు. నేటినుంచీ బద్రిప్రసాదును ఆస్థాన విదూషకుడుగా నియమిస్తున్నాం!" అన్నాడు రాజు.






బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో ఒకప్పుడు బోధిసత్వుడు, ఒక గ్రామంలో అస్పృశ్యుడుగా జన్మించాడు. అతడు ఒక చిత్రమైన మంత్రం నేర్చుకొని, అకాలంలో మామిడిపళ్లు పండించేవాడు.

రోజూ ఉదయానే ఒక కొంకికర్ర బుజాన వేసుకొని, అడవిలో మామిడిచెట్టువద్దకు వెళ్ళేవాడు. ఏడడుగుల దూరాన నించుని, మంత్రం పఠించేవాడు. కొమ్మలపైన పడే లాగ మంత్రజలం చల్లేవాడు. చూస్తూ వుండగానే, ఆ జలం చిలికినంతమేరలో కొమ్మలు కొత్త ఆకులు తొడిగి, పూత పూసి, కాయలు కాసి, పండి, పళ్ళు జలజలమని కింద రాలేవి.

ఈ సంగతి సునందుడనే బ్రాహ్మణ కుర్రవానికి తెలిసింది. ఆ అస్పృశ్యుణ్ణి ఆశ్రయించి, ఎలాఐనా ఈ మంత్రం నేర్చుకు తీరాలని వాడికి బుద్ధిపుట్టింది.

ఒకనాడు అడవినుంచి బోధిసత్వుడు ఇంటికి రాగానే సునందుడు అతని కొంకికర్ర, పళ్ళమూట అంది పుచ్చుకొని, ఇంటి లోపల చేరవేశాడు. అప్పటినుంచీ వాడు శ్రద్ధాభక్తులతో బోధిసత్వుడి ఇంట సమస్తమైన పనులూ చేస్తూవున్నాడు.

ఇలా ఉండగా—ఒక రోజున బోధిసత్వుడు తన భార్యతో "ఈ కుర్రవాడు మనల్ని ఎందుకు ఆశ్రయించుకు తిరుగుతున్నాడో తెలుసా?—మామిడిపళ్లు సృష్టించే మంత్రం నేర్చుకోవాలని వాడి ఆరాటం. ఐతే, వాడి బుద్ధి మంచిదికాదు; కనుక, మంత్రం నేర్చినా, వాడికి అది ఎంతోకాలం వుపయోగించదు," అని చెప్పాడు.

సునందుడు ఇంట్లో అంటిపెట్టుకొని వుండి తలలో నాలుకగా మసులుకోవడం చేత ఇంటామెకు మనసు కరగింది. ఆమె భర్తతో "ఈ పిల్లవాడు మన ఇంట అడ్డ





మైన పనులూ చేస్తూ, కన్న కొడుకుకంటె ఎక్కువగా ఉంటున్నాడు. మంత్రం నిలిస్తే నిలిచింది, లేకుంటే పోయింది. వాడికి మీరు ఉపదేశించక తప్పదు. ఆటుపైన వాడి భాగ్యం" అని చెప్పి, మరిమరి కోరింది బోధిసత్వుడు 'సరే' నన్నాడు.

తరువాత సునందుని పిలిచి 'అబ్బాయీ! ఇది చాలా అపూర్వమైన మంత్రం. దీని వల్ల నీకు ధనమూ, కీర్తీ రెండూ వస్తాయి. ఐతే, దీనిని ఎవరిదగ్గిర నేర్చుకొన్నావు? అనే ప్రశ్న వచ్చినప్పుడు మాత్రం రహస్యం వెల్లడించకూడదు. వెల్లడిచేశావో, ఆ క్షణమందే మంత్రపటిమ అంతరించిపోతుంది' అని చెప్పి, మంత్రం ఉపదేశించాడు.

ఈవిధంగా మంత్రం నేర్చిన సునందుడు తన ఇంటికి చేరుకొని, అకాలపు మామిడి పళ్ళు సృష్టించి, విక్రయిస్తూ వచ్చాడు.

సునందుడు విక్రయించే ఈ మామిడి పళ్లలో ఒకటి ఎలానో కాశీరాజు చేతికి వెళ్ళింది. రాజు ఆశ్చర్యపడి, కుర్రవాణ్ణి పిలిపించాడు. 'అబ్బాయీ!—రుతువు కాని రుతువులో ఇంత పరిమళంకలవీ, పసందైనవీ ఈ మామిడిపళ్ళు నీ కెక్కడివి? ఇవి దైవ సృష్టా, మానవ సృష్టా? నిజం చెప్పవలసింది' అని అడిగాడు.

అందుకు సునందుడు 'రాజా!—ఈ ఫలాలు నా కెవరూ ఇచ్చినవికావు. నాకొక మహామంత్రం తెలుసు. దాని మహిమ వల్లనే వీటిని సృష్టిస్తూవుంటాను' అని బదులుచెప్పాడు. ఆ మంత్ర మహిమ ఎలాటిదో కళ్ళారా చూడవేడుకగా ఉన్న దన్నాడు రాజు. ప్రత్యక్షంగా పళ్లు సృష్టించి కనబరుస్తానన్నాడు సునందుడు.

మరునాడు రాజు సునందుణ్ణీ, పరివారాన్నీ వెంటబెట్టుకుని తోటలోకి వెళ్లాడు. సునందుడు మంత్రజలం కొమ్మలపైన చల్లాడు. వెంటనే చెట్టునుండి వందలకొలది పళ్లు కింద రాలినై.

ఈ అద్భుతంచూసి రాజూ పరివారమూ పొందిన ఆశ్చర్యానికి అంతులేకపోయింది. వాళ్ళు పండ్లు ఏరితెచ్చి, ఆరగించారు. రాజు సునందుని మెచ్చుకుని గొప్పగా, బహుమానం చేశాడు.

అటుతరువాత రాజు, 'ఇటువంటి మంత్రం ఉపదేశించిన ఆ ప్రజ్ఞాశాలి ఎవరు?' అని ప్రశ్నించాడు.

సునందుడికి ఏమి చెప్పటానికీ పాలుపోలేదు. నిజం వెల్లడిస్తే మంత్రపటిమ పోతుందని చెప్పిన గురువువాక్యం జ్ఞాపకముంది. ఐనా, కంఠతా వచ్చిన మంత్రానికి పటిమ పోవడమేమిటి? అని తలచి, ఉన్నది వున్నట్టు చెప్పివేశాడు. అందుకు రాజు హేళనగా నవ్వి "అబ్బాయీ, యింత గొప్ప మంత్రాన్ని నువ్వు నేర్చుకున్నది, ఒక అస్పృశ్యుడిదగ్గరా? ఇహలోక సౌఖ్యాలు కోరి నువ్వు స్వధర్మాన్ని తప్పావు. ఇది చాలా నీచమైన పని," అన్నాడు.

రాజు అలా అనేసరికి సునందుడు చేసేది లేక తలవంచుకొని ఇంటికి వెళ్లిపోయాడు.

కొంతకాలం గడిచింది.

మళ్లీ ఒకనాడు కాశీరాజుకు మామిడి పండు తినాలని ఆశ కలిగింది. అతడు సునందుణ్ణి పిలిపించాడు. అతడు రాగానే రాజు తనకోర్కె తెలియబరిచాడు. అందరూ కలిసి తోటలోకి వెళ్ళారు.

సునందుడు ఎప్పటిలా చెట్టుకు ఏడడుగుల దూరంలో నించుని, మంత్రం పఠించబోయాడు. కాని ఎంతకూ ఆ మంత్రం స్ఫురణకు రాలేదు. ఎంత యత్నించినా మంత్రం జ్ఞాపకం రాకపోయేసరికి, తను మాట తప్పడంవల్ల మంత్రపటిమ అంతరించిందని, తెలుసుకున్నాడు.

సునందుడు రాజుతో తాను గురువు ఆజ్ఞను ధిక్కరించటంవల్ల మంత్రపటిమ గోల్పోయానని చెప్పి, తల వంచుకొని ఇంటికి వెళ్ళిపోయాడు.





# పిరికి యువరాజు

చాలాకాలం కిందట పర్షియాలో ఒక యువరాజుండేవాడు. అతను అన్నివిధాలా యోగ్యుడేగాని, చంద్రుడికి కళంకం ఉన్నట్టు అతనికి పిరికితనం ఒకటి ఉండేది. యువరాజుకు ఇరవై ఏళ్ళు నిండిన అనంతరం అతని తండ్రి చనిపోయాడు. యువరాజుకు పట్టంకట్టటానికి చాలా పెద్ద ఎత్తున సన్నాహాలు జరుగుతున్నాయి.

ఆ దేశంలో ఒక ఆచారం ఉంది. అదేమిటంటే సింహాసనం ఎక్కేముందు రాజు కాబోయేవాడు సింహంతో పోరాడాలి. యువరాజు కొరకు మంత్రులు ఒక సింహాన్నితెచ్చి బోనులో సిద్ధంచేసివుంచారు. పిరికివాడైన యువరాజుకు ఆ సింహం గురించి ఆలోచిస్తేనే చేతులూ, కాళ్ళూ చల్లబడసాగాయి. అందుచేత అతను రేపు పట్టాభిషేకమనగా తన గుర్రంయెక్కి, అర్ధరాత్రివేళ బయలుదేరి, దేశంవిడిచి వెళ్లాడు.

యువరాజు మూడురోజులు ప్రయాణం చేసి ఇంకో దేశం చేరుకున్నాడు. ఆ దేశం అడవులతో, వనాలతో, నదులతో చాలా అందంగా వుంది. ఒకచోట గడ్డిమేస్తున్న గొర్రెలమంద కనిపించింది. సమీపంలోనే ఒక కాపరి కుర్రాడు కూచుని పిల్లనగ్రోవి మీద హాయిగా పాడుతున్నాడు.

యువరాజు ఆ కుర్రవాణ్ణి పలకరించాడు. కుర్రాడు యువరాజును తన యజమాని ఇంటికి తీసుకుపోయాడు. వాడి యజమాని ఒక పెద్ద రైతు, పాడీ పంటా సమృద్ధిగా గలవాడు. ఆయన యువరాజుకు చక్కగా భోజనంపెట్టి, "తమరు ఎవరు? ఏవూరు? ఎక్కడికి పోతున్నారు?" అని ప్రశ్నించాడు.

"అయ్యా నేనొక యువరాజును. నా పేరు చెప్పను. పరిస్థితులు అనుకూలించక నేను దేశభ్రష్టుణ్ణి అయాను. ఇప్పుడు

బి. సత్యనారాయణ



నాకొక చోటంటూ లేదు,'' అన్నాడు యువరాజు విచారంగా.

"అయితే తమరు మా యింటనే ఉండిపొండి. తమకేలోటూ రాకుండా చూస్తాను. ఎప్పటికైనా తమకు మంచిరోజులు రాకపోవు,'' అన్నాడు రైతు.

యువరాజు రైతు అతిథ్యం స్వీకరించాడు. అతను రోజూ గొర్రెలకాపరి కుర్రాడి వెంట ఏ అడవికో, ఏ జలపాతంవద్దకో వెళుతూండేవాడు. కుర్రాడి పాట వింటూండేవాడు. ప్రకృతిసౌందర్యం చూసి ఆనందిస్తూండేవాడు. ఈ విధంగా రోజులు సుఖంగా వెళ్ళి పోతున్నాయి.



ఒకనాడు యువరాజు గొర్రెలవెంట ఒక కొండకొనకు వెళ్ళాడు. అక్కడికి ఇంకా చాలామంది గొర్రెల కాపర్లు మందలు తోలుకువచ్చారు. ఆ స్థలం చాలా మనోహరంగా వుంది. అక్కడొక మందా, ఇక్కడొక మందా మేస్తున్నాయి. గొర్రెల కాపర్లు ఉల్లాసంగా పాడుతున్నారు.

ఈసమయంలో దూరంనుంచి "సింహం! సింహం!'' అని కేక వినిపించింది. ఎక్కడి పాట లక్కడ ఆగిపోయాయి. గొర్రెల కాపర్లందరూ చేతికందిన రాళ్ళూ, కర్రలూ తీసుకుని కేక వినిపించిన దిక్కుగా పరిగెత్తసాగారు.

"పోయి సింహాన్ని చంపుదాం రా!'' అన్నాడు యువరాజువెంట వచ్చిన కుర్రాడు. కాని యువరాజు కొయ్యబారిపోయాడు. అతని నోటమాట రాలేదు. కుర్రాడు క్షణంసేపుచూసి సింహాన్ని వేటాడటానికి తానుకూడా వెళ్ళాడు.

తన అవయువాలు స్వాధీనంలోకి రాగానే యువరాజు తన ప్రాణం రక్షించుకోవటానికి చెట్టెక్కి, ఆకుల గుబురుమధ్య దాక్కున్నాడు. కొంతసేపటికి గొర్రెలకాపర్లు కేకలువేస్తూ సంతోషంగా తిరిగివచ్చారు. వారు చంపిన సింహం వారివెంట ఉన్నది.

ఇదిచూసిన యువరాజుకు సిగ్గువేసింది. గొర్రెలకాపరికుర్రాడి కున్న ధైర్యంకూడా తనకు లేదు. చచ్చిన సింహాన్ని చూస్తేనే అతనికి చేతులూ, కాళ్ళూ వణుకుతున్నాయి. గొర్రెలమందలు వెళ్లిపోయాక యువరాజు చెట్టు దిగివచ్చి, రైతుకు కనబడటానికి ముఖంచెల్లక మరొక మార్గం పట్టుకుని పోసాగాడు.

మరి మూడురోజులు ప్రయాణించినాక యువరాజు ఎడారి చేరుకున్నాడు. అక్కడ అతని కొక సైనికుల శిబిరమూ, దానికి సంబంధించిన డేరాలూ కనిపించాయి. ఆ శిబిరానికి నాయకుడైన సేనాపతి యువరాజుకు అన్నపానాలిచ్చి అదరించాడు. ఆయనతో యువరాజు తన పేరు చెప్పలేదు గాని, రైతుతో చెప్పినట్టే, తాను దేశభ్రష్టుడైన ఒకానొక యువరాజునని చెప్పాడు.

"తమరు మా శిబిరంలోనే ఒక సైనికుడుగా ఉండండి. ఏ లోటూ లేకుండా చూస్తాము. ఎప్పటికైనా మంచిరోజులు రాకపోవు" అన్నాడు సేనాపతి. యువరాజు అందుకు సమ్మతించాడు.

అతనికి ఇక్కడి జీవితంకూడా బాగానే వున్నది. కాని ఒకరోజున సైనికులందరూ గుర్రాలెక్కి బయలుదేరుతూ యువరాజును కూడా రమ్మన్నారు.






"మీరంతా ఎక్కడికి పోతున్నారు?" అన్నాడు యువరాజు.

"సమీపంలో వున్న కొండలలో సింహాలున్నాయి. వాటిని వేటాడపోతున్నాం. చాలా కాలం యుద్ధంలేని కారణంచేత ధైర్య సాహసాలు మొద్దుబారిపోతాయి. దానికి వేట సరిఅయిన విరుగుడు!" అన్నారు సైనికులు సంతోషంగా.

యువరాజు వెళ్ళక తప్పిందికాదు. కాని అతని గుండెలు గుబగుబలాడుతున్నాయి. ఆత్మరక్షణకోసమే సింహంతో పోరలేని యువరాజుకు, వాటిని వెతికి వేటాడే సైనికులు అతి సాహసులుగా కనిపించారు.

సైనికులు కొండలలో ప్రవేశించగానే యువరాజు తన గుర్రాన్ని దారితప్పించాడు. అతను కొన్నిరోజులు ప్రయాణంచేసి ఒక పెద్ద నగరం ప్రవేశించాడు. అతను దేశ భ్రష్టుడైన యువరాజని చారులవల్ల విని ఆ దేశపు రాజు అతనిని తన ఇంటికి ఆహ్వానించి, సాటిరాజుకు జరపవలసిన మర్యాదలన్నీ జరిపాడు. మంచిరోజులు వచ్చేదాకా తన అతిథిగా ఉండమన్నాడు.

ఈ రాజుగారి కొక కుమార్తె ఉన్నది. ఆమె అందగత్తె, తెలివిగలది. దేశభ్రష్టుడైన యువరాజుకు ఏ విచారమూ కలగకుండా ఉండగలందులకై, ఆమె అతని వెంటనే ఉంటూ కబుర్లు చెప్పసాగింది.

యువరాజు ఇక్కడికి వచ్చినరోజు సాయంకాలం భోజనాలయాక యువరాజూ, రాజకుమార్తె మాట్లాడుకుంటూ ఉండగా, గది వెలపల భయంకరమైన చప్పుడు వినిపించింది. దడదడా కొట్టుకునే గుండెతో యువరాజు:

"ఆ చప్పుడేమిటి?" అని అడిగాడు.

"మరేమీ లేదు. నా నల్లబంటు ఆవలింత!" అన్నది రాజకుమార్తె.

నల్లబంటు అంటే రాజకుమార్తె నౌకరయిన నీగ్రోవాడు కాబోలనుకున్నాడు

యువరాజు. మనుష్యమాత్రుడు అవలిస్తూ అంత భయంకరమైన చప్పుడు చేయటమూ, బంటు అలా ఆవలిస్తుంటే రాజకుమార్తెకు ఆగ్రహం కలగకపోవటమూ యువరాజుకు ఆశ్చర్యంగానే తోచింది.

మరి కాస్సేపు సంభాషించుకున్న తరవాత, "నిద్రపోయేవేళ అయింది. వెళ్ళి పడుకోండి" అంటూ రాజకుమార్తె లేచి తలుపు తెరిచింది. మరుక్షణం యువరాజు గుండె ఒక్కసారిగా ఆగినట్టయింది. తలుపు వెనక పెద్ద నల్లసింహం కూచుని ఉంది.

"సింహం! సింహం!" అని ఎలుగెత్తి అరిచాడు యువరాజు.

"భయపడకండి! భయపడితే అరణ్యమృగాలు మీద పడతాయని ఎరగరా? ఇది నా పెంపుడుసింహం! ఏమీ చెయ్యదు. నేనే స్వయంగా మచ్చికచేశాను. ఎప్పుడూ నావెంటే తిరుగుతూ ఉంటుంది!" అంటూ రాజకుమార్తె సింహం తలమీద చెయ్యివేసి నిమిరింది. యువరాజు కొంచెం స్థిమితపడ్డాడు. తరువాత రాజకుమార్తె నల్ల సింహాన్ని వెంటపెట్టుకుని వెళ్ళిపోయింది.

ఆరాత్రి యువరాజు నిద్రపోలేదు. తాను బాధపడుతున్నది భయంవల్లనే తప్ప, సింహాలవల్ల కాదని అతను తెలుసుకున్నాడు. గొడ్లకాపరి కుర్రాళ్ళు సింహాన్ని



చంపారు; సైనికులు సింహాలను వేటాడారు; రాజకుమార్తె సింహాన్ని స్వయంగా మచ్చిక చేసింది. వాళ్లకు భయంబాధ లేదు. తన కున్నది. అంతే తేడా! భయం లేనివాణ్ణి, సింహాలు కావుగదా, మరేదీకూడా ఏమీ చేయలేదు.

ఈ సంగతి తెలుకున్నవాడై యువరాజు తెల్లవారకమునుపే తన గుర్రంఎక్కి ఎవరికీ చెప్పకుండా స్వదేశానికి వెళ్లిపోయాడు. యువరాజు జాడ తెలియక తపించే మంత్రులూ, రాజబంధువులూ, సంతోషించారు.

"నేను సింహంతో పోరాడతాను. ఏర్పాట్లు చేయండి!" అన్నాడు యువరాజు. మర్నాడే సింహంతో యువరాజు పోరాటం ఏర్పాటయింది.

యువరాజు బల్లెంతో రంగస్థలంలోకి వచ్చి ధైర్యంగా నిలబడ్డాడు. అక్కడకు సింహం ఉండే బోను తెచ్చి దాన్ని బయటికి వదిలారు.

బోను తలుపు తెరవగానే సింహం పెద్ద పెట్టునఅరుస్తూ ముందుకు దూకింది. యువరాజు కదలలేదు, మెదలలేదు. సింహం అతనిచుట్టూ తిరిగి, అతని పక్కనే కూచుని అతని చేతిని నాకింది. అది పెంపుడు సింహం! అసంగతి మంత్రులు యువరాజు దగ్గిర దాచారు. యువరాజు ధైర్యసాహసాలు రుజువయాయి.

వెంటనే పట్టాభిషేకానికి ఆహ్వానాలు వెళ్లాయి. రైతుకూ, గొర్రెలకాపరి కుర్రాడికీ, ఎడారిలో సేనాపతికీ, సైనికులకూ, రాజుకూ, ఆయన కుమార్తెకూ కూడా పిలుపు అందింది. వారంతా వచ్చారు.

పట్టాభిషిక్తుడికి అందరూ కట్నాలు చదివించేటప్పుడు రాజుగారు, "నేను వేరే ఏకట్నాలూ తీసుకురాలేదు. నాకుమార్తెను తెచ్చాను. ఆమెను స్వీకరించు," అన్నాడు.

యువరాజు రాజకుమార్తెను పెళ్ళాడి చాలాకాలం సుఖంగా రాజ్యంచేశాడు.





# సమయస్ఫూర్తి

పూర్వం వింధ్యపర్వతాలకు దక్షిణంగా ఉండే దండకారణ్యంలో పులుల భయం జాస్తిగా ఉండేది. అవి ప్రయాణీకులను చంపి తింటూ వారివెంట ఉండే ధనాన్నీ, నగలనూ గుహలలో దాచిపెడుతూ ఉండేవి.

ఈ పులుల అడవికి సమీపంలో ఒక గ్రామం ఉండేది. అందులో ఒక మంగలి ఉండేవాడు. వాడు పేదవాడేగాని సమయస్ఫూర్తీ, సాహసమూ కలవాడు. పట్టపగలు పులులు నిద్రపోతాయి గనక, అరణ్యంలోకి వెళ్ళి పులులు చంపినవారి ధనమూ ఆభరణాలు దొరుకుతాయేమో చూడాలని మంగలికి ఆలోచన తట్టింది.

ఒకనాడు మంగలి, తన పొది చంకన పెట్టుకుని, ఎందుకైనా మంచిదని మంగలి కత్తి చేతపట్టుకుని అరణ్యంలో ప్రవేశించాడు. కొంతదూరం వెళ్ళేసరికి పొదచాటు నుంచి పులిఒకటి ఎదురు వచ్చింది.

సమయస్ఫూర్తిగల మంగలి దానిని చూసి బెదరక, "ఆహా! దొరికావా? నీకోసమే చూస్తున్నాను! భయపడకు. నిన్ను చంపనులే. నీ మీసాలు రాజుగారికి కావాలట. అవి మాత్రం కోసుకుని పోతాను. ఆయన నాకు బహుమానం ఇస్తారు!" అని చాలా మంచిగా అన్నాడు.

పెద్దపులి హడలిపోయింది.

"బాబూ, నన్ను రక్షించు. ఈ మీసాలే లేకపోతే నన్నెవరు లక్ష్యపెడతారు. రాజుగారిచ్చే బహుమానమేదో నేనే ఇచ్చుకుంటాను," అని అది ప్రాధేయపడింది.

"పోనీ, నువ్వంతగా అడుగుతున్నావు గనక నీ యిష్టప్రకారమే కానీ!" అన్నాడు మంగలి. మంగలిని పులి ఒక గుహలోకి తీసుకుపోయి ఒక డబ్బుసంచీ చూపించింది. మంగలి ఆ సంచీ తీసుకుని తన దారిన తాను ఇంటికి వచ్చేశాడు.

సి. కోటీశ్వరరావు



మంగలి సంచీ విప్పి అందులో ఉన్న ధనం లెక్క చూసుకుంటుండగా, పక్కనే ఉంటున్న కట్టెలుకొట్టేవాడు వచ్చాడు. వాడితో మంగలి జరిగినదంతా చెప్పాడు. తానుకూడా పులులను బెదిరించి డబ్బు సంపాదించుకోవాలని మర్నాడు వాడు గండ్రగొడ్డలి తీసుకుని అడవికి వెళ్లాడు.

దట్టమైన అడవిప్రాంతంలోకి వెళ్లాక వాడికికూడా ఒక పులి కనిపించింది.

"అమ్మయ్య! దొరికావా? కాస్త నిలబడు! క్షణంలో నీ తల నరికి రాజుగారికి కానుక ఇస్తాను. నాకు పెద్ద బహుమానం దొరుకుతుంది," అంటూ కట్టెలుకొట్టేవాడు గండ్రగొడ్డలి ఎత్తి పులిమీదికి దూకాడు. పెద్దపులి హడలిపోయింది.

"బాబూ, నాప్రాణం కాపాడు. రాజుగారిచ్చే బహుమతికి రెండింతలు నేనే ఇచ్చుకుంటాను!" అన్నది పులి.

"ఏదీ, ఏమాత్రం ఇస్తావో చూస్తాను! పద!" అన్నాడు కట్టెలుకొట్టేవాడు.

పెద్దపులి వాణ్ణి తన గుహకు తీసుకుపోయి అంతులేని బంగారునగలు చూపించింది. కట్టెలుకొట్టుకునేవాడు వాటన్నిటినీ మూటకట్టుకుని ఇంటికి వచ్చేశాడు.

ఈ వృత్తాంతం తెలియగానే మంగలికి మళ్ళీ ఆశ పుట్టింది. వాడు కట్టెలుకొట్టేవాడితో, "మామా, ఈవిధంగా మనం ఒక్కొక్క పులినే బెదిరించి లాభంలేదు. పులుల నన్నిటినీ హడలగొట్టామంటే ఏడు తరాలపాటు మన దరిద్రం తీరిపోతుంది. ఏమంటావు?" అన్నాడు.

కట్టెలు కొట్టేవాడు మంగలివంటి సాహసి కాడు. అందుచేత మొదట వస్తాయించాడు. కాని మంగలి ప్రోత్సహించినమీదట సరే అని ఒప్పుకున్నాడు.

ఇద్దరూ కలిసి అడివిలో చాలాదూరం వెళ్ళి, పెద్ద చెట్టెక్కి పులులు మందగా కనిపిస్తాయేమోనని చూడసాగారు.

ఈలోపుగా అడివిలోని పులులన్నీ కలిసి ఒక సభ చేశాయి. వరసగా రెండురోజులు ఇద్దరు మనుషులు రెండు పులులను బెదిరించి ధనం కాజేశారు.

"మనని మన అహారమైన మానవ మాత్రులు బెదిరించటమా? మనుషులతో పోలిస్తే మనం ఎంత బలశాలులం! ఎంత భయంకరులం!" అని వయసులో వున్న పులులు హుంకరించాయి.

కాని ఒక ముసలిపులి ఈవిధంగా హెచ్చరించింది :

"నాయనలారా! సృష్టిలో మనమే క్రౌర్యమూ, భయంకరత్వమూ గలవాళ్ళమని ఒక్కనాటికి అనుకోకండి. ధనాశకు లోబడిన మనిషికంటె క్రూరమైన, భయంకరమైన జంతువు సృష్టిలో లేదు. కనక ఇకముందునుంచీ మనం ఒంటరిగా తిరగకూడదు. మందలు మందలుగా తిరగాలి. ఐకమత్యమే మనకు బలం."

సమావేశం పూర్తికాగానే పులులన్నీ కదిలి, మంగలివాడూ, కట్టెలు కొట్టేవాడూ వున్నవైపుగా రాసాగాయి. అన్ని పులులను ఒక్కసారి చూడగానే కట్టెలుకొట్టేవాడికి వొళ్లంతా ముచ్చెమటలు పోసింది. చేతులు పట్టుతప్పి వాడు చెట్టు కొమ్మమీదనుండి కింద పడసాగాడు.

ఈ సమయంలో మంగలివాడు ఎంతో సమయస్ఫూర్తితో, "పట్టుకో! పులులన్నిటినీ పట్టుకో! ఒక్కదాన్నికూడా పోనీమాకు!" అని గొంతెత్తి భీకరంగా అరిచాడు.

ఈ అరుపులూ, విరిగిన కొమ్మలను పట్టుకుని కిందదూకే మనిషిని చూసి పులులు పూర్తిగా బెదిరి, దిక్కుతోచక, తలకొకదారిగా బలంకొద్దీ పారిపోయాయి. తరువాత మంగలికూడా చెట్టుదిగి వచ్చాడు.

ఇద్దరూ బయలుదేరి కొంతగుహలన్నీ తిరిగి పులులు దాచిన ధనమంతా కొల్లగొట్టి, ఇళ్లకు తీసుకుపోయి ధనికులైనారు.






పూర్వం రష్యాదేశంలో మార్కా అనే సంపన్నుడుండేవాడు. అతనివంటి పరమ లోభి ప్రపంచంలో లేడనుకునేవారు. ఒక నాడు మార్కా వీధివెంట పోతూండగా, వృద్ధు డొకడు కనిపించి, "ఒక్క అరగానీ ధర్మం చెయ్యండి, బాబూ!" అని అడిగాడు.

బిచ్చగాడి ఆర్తనాదాన్ని మార్కా విని పించుకోలేదుగాని, తన వెనకనే వస్తున్న పేదరైతొకడు జేబులోనుంచి ఒక అరగానీ తీసి బిచ్చగాడికి ఇవ్వటం గమనించాడు.

ఇది చూసి మార్కాకు సిగ్గయింది. ఆయన ఆగి పేదరైతుకేసి తిరిగి, "చూడబ్బీ, నాదగ్గిర చిల్లర లేదుగాని, ముష్టివాడి కివ్వ టానికి ఒక అరగానీ ఉంటే బదులిస్తావ్? నే నెవరో తెలుసుగా?" అన్నాడు.

పేదరైతు అరగానీ తీసి మార్కా కిస్తూ, "చిత్తం, దీనికోసం తమ కెప్పుడు కని పించమన్నారు?" అని అడిగాడు.

"రేపు రా!" అన్నాడు మార్కా.

మర్నాడు పేదరైతు మార్కా ఇంటికి వెళ్ళాడు. అతన్ని చూడగానే మార్కా, "అరగానికోసం వచ్చావా? నా దగ్గిర సమ యానికి చిల్లర లేదే. రేపు కనిపిస్తావా ఏమిటి?" అన్నాడు.

ఆ మర్నాడు పేదరైతు మళ్ళీ వచ్చాడు.

"పాపం, నువొచ్చావుగాని, నాదగ్గిర సమయానికి చిల్లరడబ్బులు లేకుండా ఉన్నాయి. ఒక పని చెయ్యి. నీదగ్గిర తొంభైతొమ్మిది రూపాయల పదిహేనణాల ముక్కానీ అరగానీ ఉంటే చూడు. ఏకంగా నూరురూపాయలనోటు పట్టుకుపోదుగాని," అన్నాడు మార్కా.

తనదగ్గిర అంతమొత్తం లేదన్నాడు పేదరైతు.

"అలా అయితే రెండు వారాలు దాటి కనబడు," అన్నాడు మార్కా.

టి. అనసూయ

ఆ ప్రకారమే పేదరైతు రెండు వారాలాగి మళ్ళీ వచ్చాడు. అతను అంత దూరాన ఉండగానే చూసిన మార్కా తన భార్యతో, "ఏమే, నేను చాపమీద పడుకుంటాను. నామీద గుడ్డ కప్పేసి తలదగ్గిర దీపం పెట్టు. నాకోసం పేదరైతు వస్తున్నాడు. తెల్లారి చచ్చిపోయానని చెప్పెయ్యి. ఈ పీడ విరగడవుతుంది," అన్నాడు.

మార్కా చెప్పినదంతా భార్య చేసింది. తరవాత భర్తదగ్గిర కూచుని కుమిలి కుమిలి ఏడవసాగింది. పేదరైతు రాగానే, "నీ మాటే అనుకుంటూ పోయాడు, నాయనా!" అని శోకాలు పెట్టింది.

"పోక పోక నా రుణానే పోయాడా, పాపాత్ముడు? కానీ ఏంచేస్తాం? ఖర్చులో మరింత ఖర్చు. ఈయనకు ఉత్తరక్రియలు నేనే చేయిస్తాను. శవానికి స్నానం చేయించాలి," అంటూ పేదరైతు పెరట్లోకి వెళ్ళి గంగాళంలో మసిలే వేడినీళ్లు బొక్కెనతో తెచ్చి మార్కామీద కుమ్మరించాడు. ఆ బాధకు మార్కా కాళ్ళు కదిలించాడు.

"కాళ్ళు ఝాడించటం కాదు. ఇప్పుడైనా నా అరగానీ నా మొహాన పారేస్తావా?" అన్నాడు పేదరైతు కోపంగా. మార్కా వద్దనుంచి జవాబు లేదు.




"శవాన్ని పెట్టటానికి పెట్టె తెప్పించండి. గుడికి మోయించుకు వెళ్లి అక్కడ అభిషేకాలు చేయించి తరవాత శ్మశానంలో సమాధిచేయిస్తాను," అన్నాడు పేదరైతు. మార్కా భార్య మారుమాటాడకుండా శవపేటిక తెప్పించింది. పేదరైతు పెట్టెలో మార్కాను పెట్టించి ఆలయానికి తీసుకు వెళ్ళాడు. అక్కడ చీకటిపడేదాకా పూజలూ, అభిషేకాలూ చేయించి, పేదరైతు అక్కడే ఉండిపోయాడు.

అర్ధరాత్రివేళ నలుగురు దొంగలు ఆలయంలో ప్రవేశించారు. వాళ్ల అలికిడి విని పేదరైతు విగ్రహంవెనక దాక్కున్నాడు.

దొంగలు ఎక్కడినుంచో బోలెకంత డబ్బూ, నగలూ తెచ్చారు. వాటిని గుడిమధ్య పరిచి పంచుకోసాగారు.

నగలూ, నాణ్యాల పంపకం యావత్తూ ముగిసినాక వాళ్ళవద్ద బంగారుపిడి గల ఒక కత్తి మాత్రం మిగిలింది.

దాన్ని ఎవరు తీసుకోవాలో దొంగలకు తేలలేదు. అది నాదంటే నాదని వాళ్ళు ఘర్షణ పడసాగారు.

"కత్తికోసం ఎందుకు పోట్లాడుకుంటారు. ఆ పెట్టెలో ఉన్న శవం మెడ ఎవరుకోస్తే ఆ కత్తి వారిదే," అన్నాడు పేదరైతు విగ్రహం వెనకనుంచి.

ఈ మాట వినేసరికి మార్కా తుళ్ళిపడి లేచినిలబడి, "అమ్మయ్యో. నా గొంతే?" అని చావుకేక పెట్టాడు. ఇదంతా చూసి దొంగలకు గుండెలు బద్దలైపోయాయి. వాళ్లు ధనాన్నికూడా మరిచిపోయి, ప్రాణాలు దక్కించుకునేటందుకు పారిపోయారు.

అప్పుడు పేదరైతు విగ్రహంచాటునుంచి ధైర్యంగా బయటికొచ్చాడు.

"చూడవోయ్. అయిందేదో అయిపోయింది. నీకూ నాకు పేచీ దేనికి? మన అదృష్టం బాగుండి ఇంత సొమ్ము మనపాల పడింది. మూడోకంటివాడికి తెలియకుండా దీన్ని న్యాయంగా, సమంగా పంచుకుందాం పట్టు!" అన్నాడు మార్కా పేదరైతుతో.

పేదరైతు సరేనన్నాడు. దొంగలు విడిచిపోయిన సొమ్ము యావత్తూ ఇద్దరూ సమంగా పంచుకున్నారు.

"ఇక పోదాం పద!" అన్నాడు మార్కా.

"మరి నా అరగానీ మాటేమిటి?" అన్నాడు పేదరైతు.

"చూస్తూనే ఉన్నావుగా? నాదగ్గిర చిల్లర లేదే? రేపు తప్పకుండా కనపడు," అన్నాడు మార్కా.

చాలా రేపులు గడిచాయిగాని పేద రైతుకు ఆ అరగానీ తిరిగి ముట్టనేలేదు.





# అదృష్టాలు

భువనగిరిలో ఇద్దరన్నదమ్ము లుండేవారు. ఇద్దరికీ పెళ్ళిళ్ళు అయాయి. పెద్దవాడు పేదపిల్లను చేసుకున్నాడు. చిన్నవాడు సంపన్నుల పిల్లను చేసుకున్నాడు. ఈ కారణంచేత తోడికోడళ్లకు ఒక్క క్షణం కూడా పడేదికాదు. "నేను పెద్దకోడల్ని, నా మాట నువు వినాలి," అనేది పెద్దవాడి భార్య. "నేను ధనికుల ఆడబడుచును. నా యిష్టప్రకారమే నువు నడుచుకోవాలి," అనేది చిన్నావిడ.

తమ భార్యలమధ్య కొంచెమైనా పొత్తు లేకపోవటం చూసి అన్నదమ్ములు వేసు పడ్డారు. ఐతే అన్నకు ఏటా పిల్లలుకలిగి, ఖర్చుపెరిగి, త్వరలోనే దారిద్ర్యం సంప్రాప్త మయింది. తమ్ముడు పట్టినదల్లా బంగారమై ఉన్న ఆస్తి పెరగసాగింది.

ఒకనాడు అన్నగారు తమ్ముడుదగ్గిరికి వచ్చి, "తమ్ముడూ, నా పొలం దున్నుకోవాలి. నీ ఎడ్లను రెండురోజులపాటు అరువిస్తావా?" అని అడిగాడు.

"ఇవాళ ఒక జతా, రేపు ఇంకో జతా తీసుకుపో. ఎడ్లను అలవగొట్టమాకు, జాగ్రత్త. నా ఎడ్లు పొలానే ఉన్నాయి. నే చెప్పానని చెప్పి ఒక జత తోలుకెళ్ళు," అన్నాడు తమ్ముడు.

అన్న పొలం వెళ్లి చూసి ఆశ్చర్యపడ్డాడు. తమ్ముడి ఎడ్లను ఎవరో కొత్తవాడు అరకగట్టి దున్నుతున్నాడు.

"ఇది మా తమ్ముడి పొలం. నీ వెవరు? ఎందుకీ పొలం దున్నుతున్నావు?" అని అన్న అడిగాడు.

"నీకు తెలియదా? నేను నీ తమ్ముడి అదృష్టాన్ని. అందుకనే నీ తమ్ముడు కడుపులో చల్ల కదలకుండా కూచుంటే నేనాయన పొలం దున్నిపెడుతున్నాను," అన్నాడు వాడు.

ఎ. సూర్యారావు



"మరి నా అదృష్టం ఏమైనట్టు?" అని అడిగాడు అన్న.

"ఎందు కడుగుతావు? సోమరి వెధవ! అ కనిపించే పొదవెనక పడుకుని అదే తీరున ఒకటే నిద్ర! అందుకే నీ గతి ఇలా ఉంది. చేతనైతే వాణ్ణి నిద్రలేపు," అన్నాడు తమ్ముడి అదృష్టం.

"ఇదా వీడు చేస్తున్న పని?" అంటూ అన్న లావుపాటి చింతబరికె ఒకటి చేతబట్టి పొదదగ్గిరికి వెళ్ళి, నిశ్చింతగా పడుకుని నిద్రపోతున్న తన అదృష్టాన్ని చూశాడు.

రెండు చురకలు తగిలేసరికి అన్న అదృష్టం లేచికూచుని, "నన్నెందుకు కొడతావు నిష్కారణంగా? నేనేం చేశాను నీకు?" అన్నాడు.

"ఇంకేం చెయ్యాలి? నీసాటివాడు నా తమ్ముణ్ణి కూచోబెట్టి పొలం దున్నిపెడుతుంటే నువు నిశ్చింతగా పడుకుని నిద్రపోతావా? నీ అంతు చూస్తానుండు!" అంటూ అన్న చింతబరికె మళ్లీ ఎత్తాడు.

"ఆగు, ఆగు! నాకీ పొలంపని బొత్తిగా రాదు. ఏదైనా వ్యాపారం అయితే నా ప్రతాపం చూపిస్తాను," అన్నాడు అదృష్టం.

"వ్యాపారమా? నాదగ్గిర పెట్టుబడే లేదే? నేనేం వ్యాపారం చెయ్యగలను?" అన్నాడు అన్న.

"నేను నీవెంట ఉంటే వేరే పెట్టుబడి దేనికి? పాతగుడ్డల వ్యాపారం పెట్టు. మట్టి వ్యాపారం పెట్టు. ఏ వ్యాపారం పెట్టినా నీ చేతిలో లక్ష్మిని తాండవం చేయిస్తాను. నా శక్తి చూడాలంటే వెంటనే తట్టా బుట్టా సర్దుకుని పట్నానికి ప్రయాణం పెట్టు," అన్నాడు అదృష్టం.

అన్న పట్నానికి పోబోతుండగా ఇంటి కప్పువేపునుంచి రోదన ధ్వని వినిపించింది. అన్న తల ఎత్తి చూసేసరికి ఇంటి చూరునుంచి వేళ్ళాడుతూ ఒక వికారాకారం గల ఆడది కనిపించింది.

"ఎవరమ్మా నువు? ఎందుకేడుస్తున్నావు? ఈ ఇంటి కెప్పుడు వచ్చావు?" అని అడిగాడు అన్న.

"అయ్యో, నాయనా? నేను మొదటి నుంచీ ఈ యింటిని ఆశ్రయించి ఉన్నాను. నేను నీ దురదృష్టాన్ని, ఇంతకాలం నాకు హాయిగా జరిగిపోయింది. ఇప్పుడు నన్ను విడిచి వెళ్ళిపోతావా? ఇది నీకు ధర్మమేనా?" అంటూ ఆ మనిషి ఇంకా గట్టిగా ఏడవసాగింది.

"నువ్వా, పెద్దమ్మా? నువు నావెంట రాకపోతే నాకు తోస్తుందా? రా, యీ పెట్టెలో కూచో, నావెంట తీసుకు పోతాను," అంటూ అన్న సందుగాయి పెట్టెలో వున్న సామానంతా తీసేశాడు. అతని దురదృష్టం చూరునుంచి ఆనందంతో కిందికి దూకి పెట్టెలో కూచుంది. అన్న పెట్టె మూసి తాళంవేసి, పెరట్లోకి తీసుకు పోయి, ఒక గుంటచేసి, అందులో పెట్టెను లోతుగా పూడ్చిపెట్టి, "శాశ్వతంగా అక్కడే పడివుండు. మళ్ళీ కనిపించేవు, చర్మం వొలిచెయ్యగలను!" అంటూ భార్యతో, పిల్లలతో పట్టణానికి తరలి వెళ్ళాడు.

పట్టణంలో అన్న పాతగుడ్డలన్నీ అమ్మాడు. అదృష్టం కలిసివచ్చి వాటికి మంచి ధర వచ్చింది. ఆ డబ్బుతో కొత్త



బట్టలు కొని మళ్ళీ లాభానికి అమ్మాడు. అన్న ఏ వ్యాపారం చేసినా రెట్టికి రెట్టి లాభం రాసాగింది. చాలా కొద్దికాలంలోనే అతను గొప్ప ధనికుడై కూచున్నాడు.

అన్న పట్నంవెళ్ళి ధనవంతుడైనాడని విని తమ్ముడు చూడవచ్చాడు.

"అన్నా, ఇంత కొద్దికాలంలో ఇంత డబ్బు ఎలా సంపాదించావు? ఆ కిటుకేదో కాస్త చెబుతావా?" అన్నాడు తమ్ముడు.

"ఏముందిరా? నా చూరుపట్టుకు వేళ్ళాడుతున్న దురదృష్టాన్ని పెట్టెలో పెట్టి బావిపక్కనే నిలువులోతున పాతేశాను. ఆనాటినుంచీ నాకు కలిసివచ్చింది," అన్నాడు అన్న.

అన్న అదృష్టం చూసి తమ్ముడు ఓర్చలేకపోయినాడు. అతను అన్నవద్ద సెలవు పుచ్చుకుని, అన్న ఉండిన ఇంటికి వెళ్ళి, అన్న పాతిపెట్టిన సందుగాయిపెట్టెను తవ్వితీసి, తాళం పగలగొట్టి, దురదృష్టదేవతను పైకితీశాడు. పెట్టెలోనుంచి వస్తూనే దురదృష్టదేవత, "వచ్చావా, నా తండ్రీ?" అంటూ తమ్ముడి మెడమీది కెక్కి కూచున్నది.

"నేను కాదు నీవాణ్ణి! దిగు, దిగు! నా అన్న పట్నంలో ఉన్నాడు" అని లబలబలాడాడు తమ్ముడు.

"ఆ దుర్మార్గుడి పేరు నాదగ్గిర ఎత్తకు. నువే మంచివాడవు! నీకెంత భూతదయ! నీదెంత జాలిగుండె! ఎప్పుడూ నేను నీ దగ్గిరే ఉంటాను," అన్నది దురదృష్టం.

అన్నను చూసి అసూయపడ్డందుకు తమ్ముడికి తగిన శాస్తే అయింది. అతను దురదృష్టాన్ని తన మెడమీది నుంచి దింపలేకపోయాడు. త్వరలోనే అతని ఆస్తి యావత్తూ పోయింది. అత్తవారింటికి పోతే అక్కడ అతన్ని హీనంగా చూశారు. కొన్నాళ్ళ తర్వాత అతను ఎవరికీ చెప్పకుండా బైరాగులలో చేరిపోయాడు.



# సూర్యుడు

ఆకాశంలో మనం ప్రతిరాత్రీ చూసే అనంతకోటి నక్షత్రాలలో ఒకటి సూర్యుడు. నక్షత్రాలను మనం ఇతర సూర్యుళ్ళుగా భావించవచ్చు. ఇతర నక్షత్రాలకన్న సూర్యుడు మనకు చాలా దగ్గిరిగా ఉండటంచేత సూర్యబింబం మనకెక్కువ కాంతివంతంగా కనిపిస్తుంది. ప్రస్తుతానికి ఈ సూర్యబింబం గురించి కొన్ని వివరాలు తెలుసుకుందాం:

* భూమి సూర్యుడికి దగ్గిరిగా ఉన్నప్పుడు రెంటిమధ్యా 9 కోట్ల 14 లక్షల, 6 వేల మైళ్ళుంటుంది; దూరంగా వెళ్ళినప్పుడు 9 కోట్ల 45 లక్షల, 24 వేల మైళ్ళుంటుంది. ఒక సెకండులో 1,86,000 మైళ్ళ వేగంతో ప్రసరించే వెలుతురు సూర్యుడినుంచి భూమిని చేరటానికి సుమారు 8 నిమిషాలకాలం పడుతుంది!

* సూర్యబింబం అడ్డుకొలత 8,67,000 మైళ్ళు. దాని పైభాగంయొక్క వైశాల్యం సుమారు 230 వేలకోట్ల చదరపుమైళ్ళు—భూమియొక్క వైశాల్యానికి 12 వేల రెట్లు!

* సూర్యుడియొక్క ఘనపరిమాణం 3400 కోట్ల కోట్లమైళ్ళు—భూమికి 13 లక్షల రెట్లు; బరువు 20 లక్షల–కోట్ల–కోట్ల–కోట్ల టన్నులు!—భూమికన్న 3,33,000 రెట్లు. అయితే సూర్యపదార్థం భూపదార్థంకంటె చాలా తేలిక; రెండింటినీ సమపరిమాణాలలో తీసుకుని తూచినట్టయితే సూర్యపదార్థంకన్న భూపదార్థం నాలుగురెట్లు తూగుతుంది.

* భూమికున్నట్టే సూర్యుడికికూడా గురుత్వాకర్షణశక్తి ఉన్నది. అది భూమికంటె దాదాపు 28 రెట్లు. అంటే ఒక వీసెడు బరువు తూగే వస్తువు సూర్యమండలంలో 28 వీసెలు తూగుతుంది.

* భూమిలాగే సూర్యమండలంకూడా తనచుట్టూ తాను తిరుగుతుంది. సూర్యబింబం 25 రోజుల 7 గంటల 48 నిమిషాలకొకసారి ఆత్మప్రదక్షిణం చేస్తుంది. తిరిగే వేగం (మధ్యరేఖవద్ద) గంటకు 4,407 మైళ్ళు.

* సూర్యగోళం పైభాగంలో సుమారు 10,000 డిగ్రీల వేడి ఉంటుంది. సూర్యబింబం కాంతి ఒకటిన్నరకోట్ల–కోట్ల–కోట్ల కొవ్వువత్తుల కాంతికి సమానం.

* సూర్యుడు మండుతున్న గోళం. ఈ మంటలు గోళంయొక్క పైభాగాన్నిదాటి ఆకాశంలోకి 2,86,000 మైళ్ళ ఎత్తులేస్తాయి. భూమికీ సూర్యుడికీ మధ్య చంద్రబింబం అడ్డు వచ్చి సూర్యగ్రహణం ఏర్పడి, సూర్యబింబం చంద్రబింబం వెనక ఫుండిపోయినప్పుడు ఈ అద్భుతమైన జ్వాలలు స్పష్టంగా కానవస్తాయి.

## మాయాచక్రం (అట్టచివరి బొమ్మ) - 4

దేవత తన వేలి ఉంగరం రాణికి రక్షగా ఇచ్చి, దానిని ఉపయోగించే విధం చెప్పిందికదా!—అవసరమైనప్పుడల్లా రాణి ఆ ఉంగరం కళ్ళకు అద్దుకొని, మంత్రం పఠించి, ఏ చిన్న రాయికి తాకించినా, అది బంగారు మొహరుగా మారేది. దానితో రాణి బస, భోజనం అమర్చుకొని కాలక్షేపం చేస్తూ, దేశం తిరుగుతూ వుండేది.

ఆమె పోయిపోయి, ఒక ఊరు చేరుకున్నది. ఆ వూరిలోని ఒక గుడిసెలో ఒక వృద్ధురాలు కూర్చొని వుంది. రాణి ఆమెవద్దకు వెళ్ళి 'అవ్వా, అవ్వా!—తంగేడువనంలో ఎర్రకోట ఉందట. అక్కడికి దారి చెప్పగలవా?' అని అడిగింది.

అందుకు ఆ ముసలిది 'అమ్మాయీ!—నేను ఎర్రకోటనుగురించి విన్నానేకాని, అక్కడికి ఎప్పుడూ పోలేదు. ఐనా, రెక్కలగుర్రం ఒకటి అప్పుడప్పుడు ఆకాశంనుండి దిగివచ్చి, ఎర్రకోటకు పోతూ వుంటుంది. పోయి, అక్కడినుండి రత్నాలూ, మొహరీలూ తెచ్చుకొంటూ వుంటుంది. ఆ గుర్రం వచ్చేటప్పుడూ, వెళ్ళేటప్పుడూ అదుగో ఆ ఉద్యానవనంలోని మర్రిచెట్టుకిందనే ఆగుతుంది. అది వచ్చేవరకూ ఉండగలిగితివంటే, దానివెంబడే నీవు ఎర్రకోటకు వెళ్ళవచ్చు' అని చెప్పింది.

'అయ్యో, అవ్వా! అదేంమాట—నేను వచ్చిందే ఈ పనిమీదనాయె. కనుక, తప్పకుండా ఉంటాను' అని చెప్పి, రాణి ఆత్రంతో రోజులు లెక్కిస్తూ, రాత్రిళ్ళు ఆ ఉద్యానవనంలోని మర్రిచెట్టుకిందనే పడుకొంటూ, రెక్కలగుర్రం కోసం కనిపెట్టుకొని వుంది.

కొన్ని రోజుల తరువాత ఒకనాడు అర్ధరాత్రివేళ, హఠాత్తుగా ఒక మెరుపు మెరిసినట్టయింది. ఆవెంటనే, ఒక అందాల రెక్కలగుర్రం ఆకాశంనుండి కిందికి దిగివచ్చే జాడ కనిపించింది. అలా చూస్తూవుండగానే ఆ గుర్రం సరీగా ముసలిది చెప్పినట్టుగా, ఉద్యానవనంలోని మర్రిచెట్టుకిందకే వచ్చి ఆగింది.

రాణి ఆ గుర్రందగ్గరకు వెళ్ళి, తన చరిత్ర అంతా వలపోసుకొన్నది. చివరకు 'ఓ అశ్వరాజా!—నీ మహిమనుగురించీ, నీ ఉపకారబుద్ధినిగురించీ చాలా విన్నాను. ఎలాఐనా నన్ను ఆ ఎర్రకోటకు చేర్చి పుణ్యంకట్టుకోవలిసింది' అంటూ దీనంగా వేడుకున్నది. అప్పుడు ఆ రెక్కలగుర్రం...

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

**1955 ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు**





★ పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ ఫిబ్రవరి 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

---

## ఫిబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : మూగనోము పట్టాము | రెండవ ఫోటో : మూగగానే పుట్టాము

పంపినవారు : డి. శ్రీరాములు నాయుడు,
బోర్డు ప్రాథమిక పాఠశాల - రేణిగుంట.

బహుమతిమొత్తం రు. 10/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.



# వార్తలు-విశేషాలు

60-వ అఖిలభారత కాంగ్రెసు మహాసభ జనవరి 21 నుండి 23 వరకూ మద్రాసు సమీపంలోని ఆవడిలో అతివైభవంగా జరిగింది. శ్రీ ఉచ్ఛరంగరాయ్ నవల్‌శంకర్ దేభర్‌గారు నూతనాధ్యక్షులు.

*　　　*　　　*　　　*

బొంబాయి రాష్ట్రంలోని 'ప్రకాశ' గ్రామ సమీపంలో మూడువేల సంవత్సరాలనాటి ఒక పట్టణం కనుక్కోబడింది. ఇది తపతీనదీ తీరంలో కనుగొనబడిన అతి ప్రాచీన నాగరకతా చిహ్నాలలో మొదటిది.

*　　　*　　　*　　　*

మహాత్మాగాంధిజీ జీవితగాథను చిత్రం తీయటానికి హాలీవుడ్‌లోని కొలంబియా పిక్చర్స్ వారు సన్నాహాలు చేస్తున్నారు. దీనికి 'చక్రము' అని నామకరణం జరిగింది.

*　　　*　　　*　　　*

చైనా సాంస్కృతిక రాయబారవర్గంవారు అరవైమంది సభ్యులతో మనదేశంలోని ముఖ్య నగరాలలో రెండు నెలలపాటు పర్యటన చేసి, ఆనందదాయకమైన అనేక నృత్యప్రదర్శనాలిచ్చారు. జనవరి 20-వ తేదీన వారు బర్మాకు ప్రయాణమై వెళ్ళారు.

*　　　*　　　*　　　*

ఇండియాలో తొలిసారిగా టెలివిజన్, బెంగాల్ గవర్నరు శ్రీ హెచ్. సి. ముఖర్జీగారి సమక్షమందు కలకత్తాలో ప్రదర్శింపబడింది. ఇది ఫిలిప్స్ ఎలెక్ట్రికల్స్ కంపెనీవారి రజితోత్సవ సందర్భంలో ఏర్పాటుచేయబడింది.



పెన్నానదిమీద నెల్లూరు సమీపంలో కట్టిన రోడ్డువంతెన జనవరి 10-వ తేదీన ఆంధ్రా గవర్నరు శ్రీ త్రివేదిగారిచే తెరువబడింది.

*          *          *          *

అణుశక్తితో నడిచే ప్రథమ జలాంతర్గామి ఒకటి అమెరికాదేశం తయారుచేసింది. అది 50 గంటల 1 నిమిషంసేపు నీటి అడుగున ప్రయాణంచేసి, సురక్షితంగా బయటకు వచ్చింది.

*          *          *          *

ఆంధ్రరాష్ట్రంలో రహదారుల అభివృద్ధినిమిత్తం 21 కోట్లు కావాలని రాష్ట్రప్రభుత్వం భారతప్రభుత్వాన్ని కోరింది. కేంద్రప్రభుత్వం 4 లక్షల కర్చుతో కర్నూలునందు టెలిఫోను అభివృద్ధిచేయుటానికి నిశ్చయించుకొన్నది.

*          *          *          *

మన కేంద్రప్రభుత్వ శాస్త్రపరిశోధనాలయాల నిర్మాత, ప్రకృతిసంపదల మంత్రిత్వ కార్యదర్శి ఐన డాక్టర్ ఎస్. ఎస్. భట్నగర్ హఠాత్తుగా ఢిల్లీలో మరణించడం భారతీయులందరకూ విషాదాన్ని కలిగించింది.

*          *          *          *

మనదేశంనుండి పాకిస్థాన్‌కు వెళ్ళిపోయినవారి స్థలాలలో తవ్విచూడగా, అనేకమైన నిధినిక్షేపాలు కానవస్తున్నట్టు తెలుస్తున్నది.

*          *          *          *

గుజరాత్‌రాష్ట్రంలోని సేవాదళంవారు నౌకాయానం చేస్తూ, ఇంతవరకూ ఎవరూ చూడని ఒక కొత్త జలపాతాన్ని కనిపెట్టారు.

*          *          *          *

మధుర మీనాక్షి మిల్లులో గురుస్వామిపిళ్ళె అనే గ్రుడ్డివాడున్నాడు. అతడు గణితశాస్త్రంలో మహామేధావి. కన్నుగలవారు చేయలేని అతి కష్టసాధ్యమైన లెక్కలను అతడు అరక్షణంలోనే అవలీలగా చేయగల్గుతున్నాడు.



# చిత్రకథ



తన పుట్టినరోజు బహుమతిగా వచ్చిన కెమేరాతో వాసు మంచి మంచి ఫొటోలు తీయాలనుకున్నాడు. తోడుగా దాసూ, టైగర్‌కూడా బయలుదేరారు. అంతా కలిసి ఊరిబయట వున్న ఒక మామిడితోటకు వెళ్ళారు. అక్కడ బాగా కాయలుకాసిన ఒక మామిడిచెట్టు కొమ్మల్లో ఒక పక్షిగూడు కనిపించింది.




వాసు పక్షినీ, దాని పిల్లల్నీకూడా ఫొటోతీయాలనుకున్నాడు. కెమేరా చేతబట్టి గబగబా చెట్టు ఎక్కసాగాడు. కాని గూట్లోవున్న తల్లిపక్షి ఒక్కసారి ఎగిరివచ్చి అతడి కెమేరాను తన్నసాగింది. అదేసమయంలో తోటవాడుకూడా దుడ్డుకర్రతో వచ్చాడు. వాణ్ణి చూసి వాసూ, దాసూ తోటలోంచి బయటికి పరిగెత్తారు.

Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd., Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26. Controlling Editor: SRI 'CHAKRAPANI'

Photo by B. Ranganathan



బహుమతి
పొందిన వ్యాఖ్య

మూగగానే పుట్టాము

పంపినవారు :
డి. ఎస్. నాయుడు - రేణిగుంట

